శ్లో॥ విఘ్నేశః పద్మజా విష్ణు ర్మహాదేవశ్చ పార్వతీ ।
ఆదిత్యాదిగ్రహాస్సర్వే శక్రాద్యష్టదిగీశ్వరాః।
అత్రాంగదేవతాః ప్రోక్తాః తస్మాదగ్రే ప్రపూజయేత్ ॥

తా॥ ముందుగా విఘ్నేశ్వరుఁడు, లక్ష్మీదేవి, విష్ణువు, శివుఁడు, పార్వతీదేవి, సూర్యుఁడు మొదలయిన నవగ్రహములును, ఇంద్రుఁడు మొదలగు నష్టదిక్పాలకులు నీవ్రతమునకు ముఖ్యదేవతలుగాఁ జెప్పఁబడిరి. కనుక వారిని ముందుగా పూజించవలెను.

శ్లో॥ అగ్రతః కలశే దేవం వరుణం పృథగర్చయేత్ ॥

తా॥ ముందుగా కలశమందు వరుణదేవుని దిక్పాలకులలో నుండు వరుణదేవునికంటె వేరుగాఁ బూజింపవలెను.

శ్లో॥ గణేశప్రభృతీన్పంచ కలశస్యోత్తరేన్యసేత్ ।
తత్తన్మంత్రైః ప్రాక్సమాప్త్యా పూజనీయాః ప్రయత్నతః॥

తా॥ ఈ చెప్పఁబడిన యంగదేవతలలో ముందు జెప్పఁబడిన ఐదుగురిని కలశమునకు నుత్తరభాగంబున తూర్పుసమాప్తిగా వారి వారి మంత్రములచే పూజించవలెను.

శ్లో॥ కలశస్యతు పశ్చాద్వై గ్రహాస్సూర్యపురస్సరాః ।
ఉదక్సమాప్త్యా సంస్థాప్య పూజనీయాః ప్రయత్నతః॥

తా॥ కలశముయొక్క పశ్చిమభాగమందు సూర్యుఁడు మొదలగు నవగ్రహముల నుత్తరసమాప్తిగా పూజించవలెను.

శ్లో॥ పూర్వాదిదిక్షు చేంద్రాదీ న్పూజయేచ్ఛుద్ధమానసః ।
తతో నారాయణం దేవం కలశే పూజయేత్సుధీః॥

తా॥ పిమ్మట దిక్పాలకులను తూర్పు మొదలగు దిక్కులయందు స్థాపించి స్థిరచిత్తులై పూజింపవలెను. పిమ్మట సత్యనారాయణదేవుని కలశమునందుంచి షోడశోపచారములచేత మంచి మనస్సుతోఁ గూడుకొని పూజింపవలెను.

శ్లో॥ చాతుర్వర్ణైర్వ్రతం కార్యం స్త్రీభిర్వాపి మునీశ్వర। పౌరాణికైర్వైదికైశ్చ మంత్రైర్బ్రాహ్మణసత్తమః । కల్పోక్తవిధినా

కుర్యాత్సత్యదేవస్య పూజనం । పౌరాణికైర్వేదమంత్రైః
కుర్యాత్పూజాం ద్విజేతరః॥

తా॥ ఓనారదా! నాలుగువర్ణములవారు స్త్రీలుగూడ నీవ్రతమును జేయవచ్చును. బ్రాహ్మణులు కల్పమందు చెప్పినట్లుగ పురాణోక్త వేదోక్త మంత్రములతో చేయవలయును. ద్విజేతరులు చేయుపక్షంబున పురాణోక్తమంత్రములచేతనే జరుపవలెను.

శ్లో॥ యస్మిన్కస్మిన్దినే మర్త్యో భక్తిశ్రద్ధాసమన్వితః।
సత్యనారాయణం దేవం యజేచ్చైవనిశాముఖే।

తా॥ మనుష్యుండు యేదినమందయినను భక్తిశ్రద్ధలు గలిగి సాయంకాలంబున సత్యనారాయణదేవుని విధిగా పూజించవలెను.

శ్లో॥ బ్రాహ్మణైర్బాంధవైశ్చైవ సహితో ధర్మతత్పరః ।
నైవేద్యం భక్తితో దద్యాత్సపాదం భక్ష్యముత్తమమ్॥

తా॥ ఈవ్రతమునకు ముఖ్యముగా బ్రాహ్మణులను బంధువులను బిలిచి వారితోకూడా కూడుకొని ధర్మబుద్ధిగలిగి యీవ్రతము నాచరించవలెను. ఇందు నివేదన ద్రవ్యమును భక్తిగనీయవలెను. సపాదమనఁగా నాల్గవవంతు మిగిలి యుండునటులు శేరుంబావు అర్ధశేరు నవటాకు ఈతీరున నుండుట శ్రేష్ఠంబైనది.

కించ॥ శ్లో॥ రంభాఫలంఘృతంక్షీరం గోధూమస్యచచూర్ణకం ।
అభావేశాలిచూర్ణంవా శర్కరాంచగుడంతథా।
సపాదంసర్వభక్ష్యాణి చైకీకృత్యనివేదయేత్ ॥

తా॥ ప్రసాదవస్తువులు, అరటిపండ్లు, నెయ్యి, గోధుమపిండి, పంచదార, గోధుమపిండి లేనప్పుడు బియ్యపు పిండియయినను అందు బెల్లముచేర్చి ప్రసాదముగా నుండులాగున చక్కగా కల్పి స్వామికి నివేదనము చేయవలెను.

శ్లో॥ విప్రేభ్యోదక్షిణాందద్యాత్కథాంశ్రుత్వాజనైస్సహ।
తతశ్చబంధుభిస్సార్ధం విప్రాన్సంప్రీతిభోజయేత్॥

తా॥ నివేదనమును జేసినతర్వాత బంధుమిత్రజనులతో కూడా కూడుకొని వ్రతకథ వినవలెను. పిదప బ్రాహ్మణులకొరకు దక్షిణ

లను యిప్పించెను. బ్రాహ్మణులతోను బంధువులతోను నున్న ప్రతి
దేవతయందు భక్తిగలుగునట్లుగా భుజింపఁజేయవలెను.

శ్లో॥ ప్రసాదం భక్షయేద్భక్త్యా నృత్యగీతాదికంచరేత్ । తతశ్చస్వ
గృహంగచ్ఛేత్ సత్యనారాయణంస్మరన్ ॥ ఏవంకృతేమను
ష్యాణాం వాంఛాసిద్ధిర్భవేద్ధ్రువమ్ । విశేషతః కలియుగే
లఘూపాయో౽భిభూతలే॥

తా॥ దేవునియొక్క నివేదనద్రవ్యమును భక్తితో భక్షింపవలె
ను. నాట్యము మొదలగువానినిజరిపి స్వామినిస్మరించుచు తనయింటిని
గూర్చి వెళ్ళవలెను. ఈవ్రతము యీప్రకారముగా చేసిన యెడల
మనుష్యులకు సమస్తకోరికలునిశ్చయముగా సిద్ధించును. కలియుగంబున
విశేషముగా భూలోకమందుండుజనులందఱికిని యీవ్రతము సులభోపా
యము (యీవ్రతము దేవాలయాది పుణ్యస్థలములందుజరుపవలెననుట.

ఇతి ప్రథమాధ్యాయ స్సమాప్తః.

---

## అథ ద్వితీయో౽ధ్యాయ ప్రారంభః.

సూతః॥ శ్లో॥ అథాన్యత్సంప్రవక్ష్యామి కృతంయేనపురాద్విజాః ।
కశ్చిత్కాశీపురేరమ్యే ఆసీద్విప్రో౽తినిర్ధనః।
క్షుత్తృడ్భ్యాంవ్యాకులోభూత్వా నిత్యంబభ్రామభూతలే॥

తా॥ ఓ శౌనకాదిమహామునులారా! మఱియొక కథను జెప్పు
చున్నాను. పూర్వకాలమందు యీవ్రతము యెవ్వరిచేత చేయఁబడి
నదో దానిని జెప్పెదను. సుందరమయిన కాశీపట్టణమందు వేదమును
జదివిన దరిద్రుడయిన యొక బ్రాహ్మణుఁడు కలఁడు. ఆయన యాఁకలి
దప్పికలచేత బాధపడుచు నిత్యము భూమియందు తిరుగుచుండెను.

శ్లో॥ దుఃఖితంబ్రాహ్మణందృష్ట్వా భగవాన్బ్రాహ్మణప్రియః।
వృద్ధబ్రాహ్మణరూపస్తం పప్రచ్ఛద్విజమాదరాత్ ॥

తా॥ దుఃఖముగల యాబ్రాహ్మణుని ముసలిబ్రాహ్మణరూప
ముగల భగవంతుఁడు ఆదరణతో జూచి ఒకానొక ప్రశ్న నడిగెను.

శ్లో॥ కిమర్థం భ్రమసే విప్ర మహీం నిత్యం సుదుఃఖితః।
తత్సర్వం శ్రోతుమిచ్ఛామి కథ్యతాం ద్విజసత్తమ॥

తా॥ ఓయీ! బ్రాహ్మణుఁడా నీవెందుకు దుఃఖపడుచు భూమిని దిరుగుచున్నావు. ఆవృత్తాంతమంతయును నాకువినవలెనని కోరిక గలదు గాన నాకుఁ జెప్పవలెనని భగవంతుఁడగు నాబ్రాహ్మణుఁడు అడిగెను.

బ్రాహ్మణః॥ శ్లో॥ బ్రాహ్మణోఽతిదరిద్రోహం భిక్షార్థం వై భ్రమే మహీం।
ఉపాయం యది జానాసి కృపయా కథయ ప్రభో॥

తా॥ ఓయీ! మహానుభావా! నేను బ్రాహ్మణుఁడను. మిక్కిలి దరిద్రుఁడను. భిక్షనిమిత్తము భూమిని దిరుగుచున్నాను. నాదారిద్ర్యము పోగొట్టు నుపాయము తమకుఁ దెలిసియున్న యెడల దయచేతఁ జెప్పుమని యాబ్రాహ్మణుఁడు భగవంతుని అడిగెను.

వృద్ధబ్రాహ్మణః॥ శ్లో॥ సత్యనారాయణో విష్ణుర్వాంఛితార్థఫలప్రదః।
తస్య త్వం పూజనం విప్ర కురుష్వ వ్రతముత్తమమ్॥

తా॥ కోరిన కోరికనిచ్చు సత్యనారాయణుఁడను పేరుగల విష్ణుమూర్తి యొక్క పూజను నీవు జేయుము.

శ్లో॥ యత్కృత్వా సర్వదుఃఖేభ్యో ముక్తో భవతి మానవః॥

తా॥ ఈవ్రతమును జేసిన మనుజుఁడు సమస్త దుఃఖములనుండి విడువఁబడును.

శ్లో॥ విధానం చ వ్రతస్యాస్య విప్రాయాఽభాష్య యత్నతః।
సత్యనారాయణో వృద్ధస్తత్రైవాంతరధీయత॥

తా॥ ఆవృద్ధరూపుఁడగు సత్యనారాయణమూర్తి యాబ్రాహ్మణునితో వ్రతవిధిని లెస్సగా చెప్పి యచ్చటనే కనబడకపోయెను.

శ్లో॥ తద్వ్రతం సంకరిష్యామి యదుక్తం బ్రాహ్మణేన వై।
ఇతి సంచింత్య విప్రోసౌ రాత్రౌ నిద్రాం న లబ్ధవాన్॥

తా॥ పిమ్మట ఆవృద్ధబ్రాహ్మణునిచే జెప్పఁబడిన యావ్రతమును చేయుటకు నిశ్చయించినవాఁడై యాబ్రాహ్మణుఁడు ఆరాత్రియందు నిద్రనుకూడ పొందకయుండెను.

శ్లో॥ తతఃప్రాతస్సముత్థాయ సత్యనారాయణవ్రతం।
కరిష్యఇతిసంకల్ప్య భిక్షార్థమగమద్ద్విజః॥

తా॥ తెల్లవారిన తరువాత ఉదయకాలంబున లేచినవాఁడై సత్యనారాయణ వ్రతమును జేయఁగలనని సంకల్పమును జేసినవాఁడై భిక్షాటన నిమిత్తము బయలు వెడలెను.

శ్లో॥ ఏకస్మిన్దివసేవిప్రః ప్రచురంద్రవ్యమాప్తవాన్।
తేనైవబంధుభిస్సార్థం సత్యస్యవ్రతమాచరేత్॥

తా॥ ఆ బ్రాహ్మణుఁడు యీసత్యవ్రత మహిమచే ఆదినమందే విస్తారమయిన ద్రవ్యమును సంపాదించినవాఁడై యీద్రవ్యముచేతనే సత్యనారాయణ దేవునియొక్క వ్రతమును బంధువులతోకూడాకూడు కొనినవాఁడై చేసెను.

శ్లో॥ సర్వదుఃఖవినిర్ముక్త స్సర్వసంపత్సమన్వితః।
బభూవసద్విజశ్రేష్ఠో వ్రతస్యాస్యప్రభావతః॥

తా॥ ఆబ్రాహ్మణశ్రేష్ఠుఁడు సత్యవ్రతమహిమచే సమస్తదుఃఖములనుండి విడువఁబడినవాఁడై సమస్తసంపత్తులుగలవాఁడై యుండెను.

శ్లో॥ తతఃప్రభృతికాలంచ మాసిమాసివ్రతంకృతమ్॥

తా॥ ఆబ్రాహ్మణుఁడు అది మొదలుకొని ప్రతిమాసమందు సత్యవ్రతమును చేసినవాఁడాయెను.

శ్లో॥ ఏవంనారాయణస్యేదం వ్రతంకృత్వాద్విజోత్తమః।
సర్వపాపవినిర్ముక్తో దుర్లభంమోక్షమాప్తవాన్॥

తా॥ ఆబ్రాహ్మణశ్రేష్ఠుఁడు కల్పోక్తవిధిగా యీవ్రతమును జేసి సర్వపాపములనుంచి విముక్తిని బొందినవాఁడై పొందశక్యముగాని మోక్షమును బొందినవాఁడాయెను.

శ్లో॥ వ్రతమస్యయథావిప్రః పృథివ్యాంసంకరిష్యతి।
తదైవసర్వదుఃఖంచ మనుజస్యవినశ్యతి॥

తా॥ ఈవ్రతము భూమియందు యేమనుష్యుఁడు యెప్పుడు చేయునో అప్పుడే సమస్తదుఃఖములు ఆమనుష్యుని విడిచిపోవును.

శ్లో॥ ఏవంనారాయణేనోక్తం నారదాయమహాత్మనే।
మయాతత్కథితంవిప్రాః కిమన్యత్కథయామివః॥

తా॥ ఈప్రకారము నారదముని కొఱకు విష్ణుమూర్తిచేత సీవ్రతమహిమయావత్తు జెప్పఁబడెను. దానినిమీకుఁజెప్పితిని. ఓశౌనకాదులారా! ఇంకా మీకు దేనిని చెప్పవలెనో అడగండి.

ఋషయః॥ శ్లో॥ తస్మాద్విప్రచ్ఛ్రుతంకేన పృథివ్యాంచరితంమునే।
తత్సర్వంశ్రోతుమిచ్ఛామ శ్రద్ధాఽస్మాకంప్రజాయతే॥

తా॥ ఓయి సూతమహాముసీ! ఆబ్రాహ్మణునివలన విని యీ లోకమందు యెవనిచేత చేయఁబడినదో దానిని సవిస్తరముగా చెప్పవలెను. ఆవృత్తాంతమంతయు మాకువినవలెనని కోరికగలిగియుండెను.

సూతః॥ శ్లో॥ శృణుధ్వంమునయస్సర్వే వ్రతంకేనకృతంభువి।
ఏకదాసద్విజవరో యథావిభవవిస్తరైః।
బంధుభిస్స్వజనైస్సార్థం వ్రతంకర్తుంసముద్యతః॥

తా॥ ఓ మునులారా! ఈవ్రతము ఆబ్రాహ్మణుని వలన విని యెవనిచేత చేయఁబడినదో దానిని జెప్పెదను వినుఁడు. ఆబ్రాహ్మణుఁడు ఒకానొకప్పుడు తన సంపత్తుకుఁ దగినట్టుగా! బంధువులతోను, స్వజనులతోను, కూడుకొని యీవ్రతమునుచేయుటకు ప్రారంభించెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరేకాలే కాష్ఠక్రేతాసమాగతః।
బహిఃకాష్ఠానిసంస్థాప్య విప్రస్యగృహమాయయా॥

తా॥ ఆబ్రాహ్మణుఁడు వ్రతముచేయు కాలమందు ఒకానొక కట్టెలమ్మువాఁడు వచ్చి కట్టెలను వెలుపలనుంచి యాబ్రాహ్మణుని యొక్క గృహములోనికి వెళ్ళినవాఁడాయెను.

శ్లో॥ తృష్ణయాపీడితాత్మాచ దృష్ట్వావిప్రంకృతవ్రతం।
ప్రణిపత్యద్విజంప్రాహ కిమిదంక్రియతేత్వయా।
కృతేకింఫలమాప్నోతి విస్తరాద్వదమేప్రభో॥

తా॥ ఆ కట్టెలమ్మువాఁడు దాహముగలవాఁడై వ్రతమును చేయుచున్న యీబ్రాహ్మణునిజూచి నమస్కరించినవాఁడై యిదియే

మి, యీవ్రతమును జేసిన మొగల యేమిఫలమును బొందుదురు. సవి స్తరముగ నాకుఁజెప్పుడని యాబ్రాహ్మణుని యడిగెను.

విప్రః॥ శ్లో॥ సత్యనారాయణస్యేదం వ్రతంస ద్వేప్సితప్రదం।
తస్యప్రపూజ నేసర్వం ధనధాన్యాదికంమహాత్॥

తా॥ ఇది సత్యనారాయణ దేవునియొక్కవ్రతము. ఇది అన్ని కోరికలనిచ్చునది. దీనివలన ధనధాన్యాది గొప్పసంపత్తులుకలుగును.

శ్లో॥ తస్మాదేతద్వ్రతంజ్ఞాత్వా కాష్ఠక్రేతాఽతిహర్షితః।
పపౌజలంప్రసాదంచ భుక్త్వాస్వనగరంయయౌ॥

తా॥ కట్టెలమ్మువాడు ఆబ్రాహ్మణునివలన యీ వ్రతఫలమును దెలిసికొని సంతుష్టమనస్సుగలవాఁడై ఉదకముపానముచేసితర్వాత ప్రసాదమును భక్షించి తనపట్టణమునుగూర్చి వెళ్లినవాఁడాయెను.

శ్లో॥ సత్యనారాయణం దేవం మానసే నేత్యచింతయత్।
కాష్ఠవిక్రియతోగ్రామే ప్రాప్యతేచాద్యయద్ధనం॥
తేనైవసత్య దేవస్య కరిష్యేవ్రతముత్తమం।
ఇతిసంచిత్యమనసా కాష్ఠంకృత్వాతుమస్తకే॥

తా॥ ఓ సత్యనారాయణస్వామీ! మీపూజను చేయుటకు ఉపక్రమించినాను. ఈకట్టెలమ్ముటవలన నాకు యెంతద్రవ్యము లభ్యమగునో ఆద్రవ్యముచేతనే మీవ్రతమును చేయగలను. అని పలికినవాఁడై ఆకట్టెలమోపును శిరస్సునందుంచుకొనెను.

శ్లో॥ జగామనగరేరమ్యే ధనినాంయత్రసంస్థితః। తద్దినేకాష్ఠమూల్యంచ ద్విగుణంప్రాప్తవానసౌ। తతఃప్రసన్న హృదయస్సుపక్వంకదళీఫలం॥ శర్కరాఘృతదుగ్ధంచ గోధూమస్యచచూర్ణకం। కృత్వైకత్రసపాదంచ గృహీత్వాస్వగృహంయయౌ॥

తా॥ పిమ్మట సుందరమైన యానగరమందు ధనవంతులున్న వీధికి వెళ్లెను. ఆకట్టెలమ్మువాఁడా దినమందు సత్యదేవుని మహిమచేత రెట్టింపుధనమును బొందినవాఁడై పిమ్మట నిర్మలమైన మనస్సుగలవాఁడై చక్కగాపండిన యఁటిపండ్లును, పంచదారయును, నెయ్యి

పాలు, గోధుమపిండియును సమపాళ్లు గలుగునట్లుగా తీసికొని తన యింటికిఁ వెళ్లినవాడాయెను.

శ్లో॥ తతోబంధూన్సమాహూయ చకారవిధినావ్రతం।
తస్యవ్రతస్య ప్రభావేన ధనపుత్రాన్వితోభవత్।
ఇహలోకేసుఖంభుక్త్వా చాంతేసత్యపురంయయౌ॥

తా॥ పిమ్మట బంధువులను బిలుచుకొని కథోక్తవిధిగా నీవ్రతమును జేసెను. ఈవ్రతమహిమచేతనే ఆ కట్టెలమ్మువాడు ధనముతోను, పుత్రులతోను సంధియుండెను. ఇహలోకంబున సమస్త సుఖములనను భవించి జీవితాంతంబున వైకుంఠమును బొందినవాడాయెను.

ఇతి ద్వితీయోఽధ్యాయః సమాప్తః.

---

## —♦ అథ తృతీయోఽధ్యాయ ప్రారంభః. ♦—

సూతః॥ శ్లో॥ పునరగ్రేప్రవక్ష్యామి శృణుధ్వంమునిసత్తమాః।
పురాచోల్కాముఖోనామ నృపశ్చాసీన్మహీపతిః॥

తా॥ ఓ మునులారా! ఇప్పుడు తిరిగి మఱియొక కథను జెప్పుచున్నాను వినుఁడు. పూర్వకాలమందు ఉల్కాముఖుఁడను పేరుగల యొకరాజు భూమి కధిపతిగా నుండెను.

శ్లో॥ జితేంద్రియస్సత్యవాదీ గచ్ఛన్ దేవాలయంప్రతి।
దినేదినేధనందత్వా ద్విజాన్సంతోషయేత్సుధీః॥

తా॥ ఆ రాజు ఇంద్రియనిగ్రహముగలవాఁడు. సత్యము పలుకువాఁడు. ప్రతిదినమందు దేవాలయమునుగూర్చి వెళ్లువాడు. ప్రతిదినంబును బ్రాహ్మణులను సంతోషపఱచుచు ద్రవ్యదాత యని పించుకొని యుండెను.

శ్లో॥ భార్యాతస్యప్రముగ్ధాచ సరోజవదనాసతీ।
భద్రశీలానదీతీరే సత్యస్యవ్రతమాచరేత్॥

తా॥ ఆరాజునకు సుందరమయిన పతివ్రతయగు భార్యకలదు. వారుభయులు భద్రశీలానదీతీరంబున సత్యదేవుని వ్రతమును జేసిరి.

శ్లో॥ ఏతస్మిన్నంతరేతత్ర సాధురేకస్సమాగతః।
వాణిజ్యార్థంబహుధనై రనేకైః పరిపూరితామ్॥
నావంసంస్థాప్యతత్తీరే జగామనృపతింప్రతి।
దృష్ట్వాచవ్రతినంభూపం పప్రచ్ఛవినయాన్వితః॥

తా॥ ఈవ్రతమును జేయుకాలమందు వర్తకముకొఱకు సాధువను నొక కోమటి బహువిధములయిన ద్రవ్యములతోఁగూడ వచ్చినవాఁడై ఓడను ఆభద్రశీలానదీతీరంబుననుంచి ఆ నదీతీరమందు సత్యవ్రతమును జేయుచున్న యీరాజునుజూచి వినయముతో నొకప్రశ్న చేసినవాఁడాయెను.

సాధుః॥ శ్లో॥ కిమిదంకురుషేరాజన్ భక్తియుక్తేనచేతసా।
ప్రకాశంకురుతత్సర్వం శ్రోతుమిచ్ఛామిసాంప్రతమ్॥

తా॥ ఓరాజా! భక్తితోఁజేయు నీవ్రతమువేమి, ఇది సవిస్తరముగా జెప్పుము. వినుటకు నాకాసక్తి గలిగియుండెనని ప్రశ్న చేసెను.

రాజా॥ శ్లో॥ పూజనంక్రియతేసాధో విష్ణోరతులతేజసః।
వ్రతంచస్వజనైస్సార్థం పుత్రాద్యవాప్తికామ్యయా॥

తా॥ ఓ కోమటీ! నిరుపమాన తేజశ్శాలియగు శ్రీసత్యనారాయణవ్రతముయొక్క పూజను జేయుచున్నాను. ఈవ్రతము నేను స్వజనులతోఁగూడ కూడుకొని పుత్రాదిప్రాప్తికై చేయుచుంటినని రాజు వర్తకునితో జెప్పెను.

శ్లో॥ భూపస్యవచనంశ్రుత్వా సాధుఃప్రోవాచసాదరం।
మమాపిసంతతిర్నాస్తి హ్యేతస్మాజ్జాయతేధ్రువమ్॥

తా॥ ఆవర్తకుఁడు రాజుయొక్క వాక్యమును విని యాదరణ కలుగునట్లుగా నీక్రింది వాక్యమును బలికెను. ఓరాజా! నాకునుసంతానము లేదు. ఈసత్యవ్రతమువలన నిశ్చయముగా సంతానము కలుగునని పలికెను.

శ్లో॥ తతోనివృత్యవాణిజ్యా త్సానందోగృహమాయయౌ।
భార్యాయైకథితంసర్వం వ్రతంసంతతిదాయకమ్॥

తా॥ అనంతర మానవర్తకుఁడు వర్తకముమాని వేసి యానంద

ముతోఁ గూడినవాడై తనయింటికి వెళ్లి సంతానమునిచ్చునట్టి యీసత్య
వ్రతమును భార్యకుఁ జెప్పినవాఁడాయెను.

శ్లో॥ తదావ్రతంకరిష్యామి యదామేసంతతిర్భవేత్ ।
ఇతిలీలావతీంప్రాహ పత్నీంసాధుస్సుసత్తమః॥

తా॥ నాకునెప్పుడు సంతానము కలుగునో యప్పుడే యీసత్య
వ్రతమును జేసెదనని సాధువు తన భార్యతోఁ జెప్పెను.

శ్లో॥ ఏకస్మిన్దివసేతస్య భార్యాలీలావతీసతీ ।
భర్త్రాయుక్తాఽఽనందచిత్తాఽభవద్ధర్మపరాయణా॥

తా॥ అతని భార్యయయిన లీలావతి ఒకానొక దినంబున ధర్మ
మందాసక్తిగలిగి పెనిమిటితోఁ గూడి యానందమును బొందుచుండెను.
(అనఁగా సంభోగము చేసిరనుట)

శ్లో॥ గర్భిణీసాఽభవత్తస్య భార్యాతస్యప్రసాదతః ।
దశమేమాసివైతస్యాః కన్యారత్నమజాయత॥

తా॥ ఈలీలావతి సత్యదేవునియొక్క యనుగ్రహము వలన
గర్భము ధరించినదాయెను. పదియవ మాసంబున యోగ్యతగల
కుమార్తె జన్మించెను.

శ్లో॥ దినేదినేసావవృధే శుక్లపక్షేయథాశశీ ।
నామ్నాకళావతీచేతి తన్నామకరణంకృతమ్॥

తా॥ ఆ చిన్నది పుట్టినది మొదలు శుక్లపక్షచంద్రునివలెవృద్ధి
పొందుటచేత ఆచిన్నదానికి కళావతియని నామకరణము చేసిరి.

శ్లో॥ తతోలీలావతీప్రాహ స్వామినంమధురంవచః ।
నకరోషికిమర్థంవై పురాసంకల్పితంవ్రతమ్॥

తా॥ అనంతరము లీలావతియను నతనిభార్య పెనిమిటినిగూర్చి
స్వామీ! పూర్వము తమరు సంకల్పించిన వ్రతమెందునిమిత్తము
చేయరని యడిగెను.

సాధుః॥ శ్లో॥ వివాహసమయేతస్యాః కరిష్యామివ్రతంప్రియే ।
ఇతిభార్యాంసమాశ్వాస్య జగామనగరంప్రతి॥

తా॥ ఓప్రియురాలా! పుత్రికయొక్క వివాహకాలమందు సత్య

వ్రతము చేసెదను అని యీప్రకారము తన భార్యయయిన లీలావతి తో చెప్పినవాఁడై ఆమెను సమాధానపఱచి పిమ్మట వర్తకము కొఱకు పట్టణమునుగూర్చి వెళ్లినవాఁడాయెను.

శ్లో॥ తతఃకళావతీకన్యా వవృధేపితృవేశ్మని।
దృష్ట్వాకన్యాంతతస్సాధుః నగరేసఖిభిస్సహా॥
మంత్రయిత్వాద్రుతందూతం ప్రేషయామాసధర్మవిత్।
వివాహార్థంచకన్యాయావరం శ్రేష్ఠం విచారయ॥

తా॥ పిమ్మట కళావతియనుచిన్నది తండ్రియొక్క గృహమందు వృద్ధిబొందుచుండెను. కొంతకాలమునకు స్నేహితురాండ్రతో కూడా కూడుకొని యాడుకొనుచున్న తన కుమార్తెనుజూచినవాఁడై ధర్మము దెలిసిన యావర్తకుఁడు ఆచిన్నదాని వివాహకాలము సమీపించినదని దెలిసికొని త్వరితముగా తనదూతను తన కుమార్తెయొక్క వివాహముకొఱకు శ్రేష్ఠుఁడయిన వరుని విచారింపుమని ఆజ్ఞయిచ్చినవాఁడాయెను.

శ్లో॥ తేనాజ్ఞప్తశ్చదూతోఽసౌ కాంచనంనగరంయయౌ।
తస్మాదేకంవణిక్పుత్రం సమాదాయాగతోహిసః॥

తా॥ పిదప ఆభటుఁడు వర్తకునిచే ఆజ్ఞనుబొందినవాఁడై కాంచనమను పట్టణమునుగూర్చి వెళ్లినవాఁడాయెను. ఆచోటనుండి ఒకవర్తకునియొక్క పిల్లవానిని తీసికొని యథాస్థానమునకువచ్చినవాడాయెను.

శ్లో॥ దృష్ట్వాతంసుందరంబాలం వణిక్పుత్రంగుణాన్వితం।
జాతిభిర్బంధుభిస్సార్థం పరితుష్టేనచేతసా।
దత్తవాన్సాధుఃపుత్రీంతాం కన్యాంవిధివిధానతః॥

తా॥ అప్పుడా సాధువు మంచిగుణములుగల సుందరుఁడయిన వణిక్పుత్రునిఁజూచి జ్ఞాతులతో బంధువులతోఁగూడి సంతుష్ట మనస్సుగలవాఁడై తన కుమార్తెను శాస్త్రోక్తవిధిగా కన్యాదానము చేసెను.

శ్లో॥ తతోభాగ్యవశాత్తేన విస్మృతంవ్రతముత్తమం।
వివాహసమయేతస్యాస్తేనరుష్టోఽభవత్ప్రభుః॥

తా॥ తర్వాత ఆవర్తకుఁడు ధనాధిక్యముచేత వివాహకాల

మందున్ను సత్యవ్రతమును మఱచుటచేత సత్యనారాయణస్వామి కోపము గలవాఁడాయెను.

శ్లో॥ తతఃకాలేననియతో నిజకర్మవిశారదః।
వాణిజ్యార్థంగతశ్శీఘ్రం జామాతృసహితో వణిక్।
రత్నసానుపురేరమ్యే స్థిత్వాసింధుసమీపతః।
వాణిజ్యమకరోత్సాధుస్త్జామాత్రాశ్రీమతాసహ॥

తా॥ కొంతకాలమునకు పిమ్మట తన కర్మపరిపాకమున శీఘ్రముగా నల్లుని దీసికొని వర్తకము నిమిత్తము బయలువెడలి యతిరమ్యమైన రత్నసానుపురంబున సముద్రతీరమందు భాగ్యవంతుఁడగు నల్లునితో గూడి వర్తకము చేయుచుండెను.

శ్లో॥ తౌగతౌనగరంరమ్యం చంద్రకేతోర్నృపస్యచ।
ఏతస్మిన్నంతరేకాలే సత్యనారాయణఃప్రభుః।
భ్రష్టప్రతిజ్ఞమాలోక్య శాపంతస్మైప్రదత్తవాన్॥

తా॥ వారిద్దవురు చంద్రకేతు మహారాజు నగరమునకుఁ బోయిరి, ఆసమయంబున సత్యనారాయణమూర్తి భ్రష్టప్రతిజ్ఞగలవానిగా దెలిసికొని యావర్తకునికి శాపంబిచ్చెను.

శ్లో॥ దారుణంకఠినంచాస్య మహద్దుఃఖంభవిష్యతి।
ఏతస్మిన్దినసేరాజ్ఞో ధనమాదాయతస్కరః।
తత్రైవచాగతశ్చోర్యా ద్వణిజౌయత్రసంస్థితౌ॥

తా॥ దారుణమయిన కఠినమయిన గొప్పదుఃఖమును బొందుమని శపించెను. ఈశాపంబిచ్చిన రోజుననే శాపమహిమచేత నొకదొంగవాఁడు ఆచంద్రకేతు మహారాజుయొక్క గృహమందు ధనమును దొంగిలించి యావర్తకులున్న స్థలమునకే వచ్చినవాడై

శ్లో॥ తత్పశ్చాద్ధావకాన్దూతాన్ దృష్ట్వాభీతేనచేతసా।
ధనంసంస్థాప్యతత్రైవ సతుశీఘ్రమలక్షితః॥

తా॥ అతనియొక్క వెనుక తరుముచున్న భటులనుజూచి భయముకలవాడై ధనమును వర్తకులున్న స్థలమందేయుంచి కనఁబడనివాఁడాయెను.

శ్లో॥ తతోదూతాస్సమాయాతాః యత్రాస్తే సజ్జనో వణిక్ ।
దృష్ట్వా నృపధనం తత్ర బధ్వానీతౌ వణిక్సుతౌ॥

తా॥ అనంతరము దూతలు వచ్చి సత్పురుషుఁడయిన యా వర్తకుఁడు యెచ్చటనున్నాఁడో యచ్చటనే యాధనమునుజూచి వీరలే దొంగలని యావర్తకుల నిద్దరినికట్టి తీసికొనివెళ్లిరి.

శ్లో॥ హర్షేణధావమానాశ్చ ఊచుర్నృపసమీపతః ।
తస్కరౌ ద్వౌసమానీతౌ విలోక్యాజ్ఞాపయప్రభో॥

తా॥ ఆదూతలు ఇద్దరు దొంగలను తీసికొని సంతోషముతో శీఘ్రముగా చంద్రకేతు మహారాజు వద్దకు వచ్చి ఓరాజా! ఇద్దరు దొంగలను పట్టితెచ్చితిమి. వీరలఁజూచి చేయుపని నాజ్ఞాపింపుఁడు అని యడిగెను.

శ్లో॥ రాజ్ఞాఽజ్ఞప్తాస్తతశ్శీఘ్రం దృఢంబద్ధ్వాతుతావుభౌ ।
స్థాపితౌ చమహాదుర్గే కారాగారేఽవిచారతః॥

తా॥ అనంతరమా భటులు రాజుచే నాజ్ఞాపింపఁబడినవారై విచారణలేకుండ వర్తకు లిద్దఱిని సంకెళ్లువేసి శీఘ్రముగా కఠినమైన బంధిఖానా యందుంచినవారైరి.

శ్లో॥ మాయయాసత్యదేవస్య నశ్రుతం కైస్తయోర్వచః ।
తతస్తయోర్ధనం రాజా గృహీతంచంద్రకేతునా॥

తా॥ సత్యదేవునియొక్క మహిమచే వర్తకులు చెప్పుకొనుచున్న సంగతులు ఎవరిచేతనున్ను వినబడనివాయెను. వారిని ఖయిదుచేసిన తర్వాత వారి సంబంధమయిన ధనము రాజుచేతీసికోబడెను.

శ్లో॥ తచ్ఛాపాచ్చతయోర్గేహే భార్యాచైవాతిదుఃఖితా ।
చోరేణాపహృతంసర్వం గృహేయచ్చస్థితంధనమ్॥

తా॥ సత్యదేవుని శాపమువల్లనే వారి గృహమందుండుభార్య కూడ మిక్కిలి దుఃఖము ననుభవించెను. అది యేమనగా గృహమందున్న ధనమంతయు దొంగలు అపహరించిరి.

శ్లో॥ ఆధివ్యాధిసమాయుక్తా క్షుత్పిపాసాదిదుఃఖితా ।
అన్నచింతాపరాభూత్వా బభ్రామచగృహేగృహే॥

తా॥ ఇంకా మనోవ్యధ శరీరబాధలుకలదై యీ కలిదప్పులు కలిగి అన్నమెచ్చటదొరుకునను విచారముకలిగి ప్రతిగృహమునందుఁ దిరుగుచుండెను.

శ్లో॥ కళావతీతికన్యాఽపి బభ్రామప్రతివాసరం।
ఏకస్మిన్దివసేయాతా క్షుధార్త్తాద్విజమందిరమ్॥

తా॥ కలావతియను నతని కుమార్తెయున్నూ ప్రతిదినము యాచనకొఱకుఁ దిరుగుచుండెను. ఇట్లు తిరుగుచుండగా నొకానొక దినంబున ఆకలి కలదై ఒక బ్రాహ్మణ గృహమును గూర్చి వెళ్ళినదాయెను.

శ్లో॥ గత్వాఽపశ్యద్వ్రతంతత్ర సత్యనారాయణస్యచ।
ఉపవిశ్యకథాంశ్రుత్వా వరంప్రార్థితవత్యపి॥

తా॥ ఆబ్రాహ్మణుని గృహమునకువెళ్ళి సత్యనారాయణవ్రతమునుజూచి తదనంతరంబున కూర్చుండి వ్రతకథను విని సత్యదేవుని గూర్చి మిక్కిలి ప్రార్థించినదాయెను.

శ్లో॥ ప్రసాదభక్షణంకృత్వా యయౌరాత్రంగృహంప్రతి।
మాతాకలావతీంకన్యాం కథయామాసప్రేమతః॥

తా॥ ప్రసాదమును భక్షించి రాత్రియందు ఇంటికి వెళ్లెను. తల్లి ప్రేమగల తనకుమార్తెను ప్రశ్నించెను.

శ్లో॥ పుత్రీరాత్రౌస్థితాకుత్ర కింతేమనసివర్తతే।
కన్యాకలావతీప్రాహ మాతరంప్రతిసత్వరమ్॥

తా॥ రాత్రికాలము కొంత గడచుటచే నయఃకాలమందుండి పైనిమిటి సమాపమందు లేకుండుటచేత తల్లి సంశయము కలదై ఓ పుత్రికా! యింతరాత్రి యచ్చటనున్నావు? నీమనస్సులో నేమి సంకల్పము కలిగినదని శీఘ్రపూర్వకముగా నడుగగా కలావతియనుచిన్నది తల్లియొక్కమనస్సును తెలిసికొనిఆలోచన లేకుండ త్వరగాజవాబిచ్చెను.

శ్లో॥ ద్విజాలయేవ్రతంమాతః దృష్టంవాంఛితసిద్ధిదం।
తచ్ఛ్రుత్వాకన్యకావాక్యం వ్రతంకర్తుంసముద్యతా॥

తా॥ ఓతల్లీ! బ్రాహ్మణునియొక్క గృహమందు సమస్త

కోరికల నిచ్చు సత్యనారాయణ వ్రతమును జూచితినని చెప్పెను. ఆ పుత్రికయొక్క వాక్యమును వినగానే పూర్వము తన పెనిమిటియొక్క ప్రతిజ్ఞ జ్ఞాపకము తెచ్చుకొని యిందువల్లగదా యింతకష్టముల పాలయితిమని యావ్రతమును జేయుటకు ప్రారంభించెను.

శ్లో॥ సాముదాతువణిగ్భార్యా సత్యనారాయణస్యవై ।
వ్రతంచక్రేతదాసాధ్వీ బంధుభిస్స్వజనైస్సహ॥

తా॥ వర్తకుని భార్యయైన లీలావతి బంధుజనులతో గూడ తత్క్షణమే సత్యవ్రతమును జేసెను.

శ్లో॥ భర్తృజామాతరౌక్షిప్ర మాగచ్ఛేతాంస్వమాశ్రమం ।
అపరాధంచ మేభర్తుర్జామాతుఃక్షంతుమర్హసి॥

తా॥ నా పెనిమిటి, అల్లుడున్నూ త్వరగా నింటికి వచ్చెదరుగాక, వారియొక్క తప్పును క్షమించవలెనని ఆదేవుని ప్రార్థించెను.

శ్లో॥ వ్రతేనానేనసంతుష్టో సత్యనారాయణఃప్రభుః ।
దర్శయామాసస్వప్నంహి చంద్రకేతోర్నృపస్యచ॥

తా॥ సమర్థుడయిన యా సత్యనారాయణమూర్తి యీవ్రతముచే సంతోషించినవాడై చంద్రకేతు మహారాజునకు స్వప్నమును కనబఱచెను.

శ్లో॥ బంధితౌమోచయప్రాతః వణిజౌనృపసత్తమ ।
దేయంధనంచతత్సర్వం గృహీతంయత్త్వయాఽధునా॥

తా॥ ఓ రాజా! ఉదయమున బంధించియున్న వర్తకుల నిద్దరను ప్రాతఃకాలంబున విడిపించి నీవు పుచ్చుకొనిన ధనమంతయు నియ్యతగినది.

శ్లో॥ నోచేత్వాంనాశయిష్యామి సరాజ్యధనపుత్రకం ।
ఏవమాభాష్యరాజానం ధ్యానగమ్యోఽభవత్ప్రభుః॥

తా॥ ఆప్రకారము చేయని యెడల నీరాజ్యము, నీధనము, నీపుత్రులతోఁగూడిన నిన్ను నశింపఁజేసెదనని రాజునుగూర్చి స్వప్నమందు జెప్పి సత్యనారాయణమూర్తి యదృశుడాయెను.

శ్లో॥ తతఃప్రభాతసమయే రాజాచస్వజనైస్సహ ।
ఉపవిశ్యసభామధ్యే ప్రాహస్వప్నంజనంప్రతి॥

తా॥ పిమ్మట ఆ చంద్రకేతు మహారాజు ప్రాతఃకాలమందు స్వజనులతో గూడుకొని సభామధ్యంబున కూర్చుండి తనకు రాత్రి యందు సంభవించిన స్వప్నమును ప్రజలతో జెప్పినవాడాయెను.

శ్లో॥ బద్ధామహాజనౌశీఘ్రం మోచయధ్వంవణిక్సుతౌ ।
ఇతిరాజ్ఞోవచశ్శ్రుత్వా మోచయిత్వామహాజనౌ॥

తా॥ ఆరాజు స్వప్నవృత్తాంతమునుజెప్పి బంధిఖానాలోనున్న మహాత్ములయిన వర్తకులను విడిపింపుడని పలుకఁగా నావాక్యమును విని యామహాత్ములను విడిపించిరి.

శ్లో॥ సమానీయనృపస్యాగ్రే ప్రాహుస్తేవినయాన్వితాః ।
ఆనీతౌద్వౌవణిక్పుత్రౌ ముక్తౌనిగళబంధనాత్॥

తా॥ తీసికొనివచ్చి రాజుయొక్క ముందరను వినయము కల వారయిన భటులు వర్తకులిద్దఱను సంకెళ్లనుండి విడిపించి తీసికొని రాబడిరని పలికిరి.

శ్లో॥ తతోమహాజనౌనత్వా చంద్రకేతుంనృపోత్తమం ।
స్మరంతౌపూర్వవృత్తాంతం నోచతుర్భయవిహ్వలాః॥

తా॥ ఆభటులు చెప్పిన తర్వాత మహాత్ములయిన యావర్తకులు రాజశ్రేష్ఠుఁడయిన యాచంద్రకేతు మహారాజునకు నమస్కరించి, విచారించి, విచారణలేక శిక్షించిన పూర్వవృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చుకొని తిరిగి విచారణలేకుండ యేమి శిక్ష వేయునోయని భయముచేత నేమియు పలుకక యూరకుండిరి.

శ్లో॥ రాజావణిక్సుతౌప్రేక్ష్య వచఃప్రోవాచసాదరం ।
దైవాత్ప్రాప్తంమహద్దుఃఖ మిదానీంనాస్తివైభయమ్॥

తా॥ ఆచంద్రకేతు మహారాజు వర్తకులనుజూచి యిదివఱకు యీగొప్ప దుఃఖము దైవాధీనముగా కలిగినది. ఇప్పుడు మీకు యేమియు భయములేదని ధైర్యవాక్యము బలికెను.

శ్లో॥ తదానిగళసంత్యాగం క్షౌరకర్మాద్యకారయత్ ।
వస్త్రాద్యలంకృతిందత్వా పరితోష్యనృపశ్చతౌ॥

తా॥ అప్పుడే సంకెళ్లూడదీయించి క్షౌరకర్మ మొదలయిన

వానిని చేయించెను. పిమ్మటవస్త్రాలంకారములిచ్చి వానినిసంతోషింపజేసి

శ్లో॥ పురస్కృత్యవణిక్పుత్రౌ వచసాతోషయద్భృశం।
పురానీతంతుయద్ద్రవ్యం ద్విగుణీకృత్యదత్తవాన్॥

తా॥ ఆవర్తకుల నిరువురను గౌరవించి స్తోత్రవాక్యములచే మిక్కిలి సంతోషపఱచినవాడై పూర్వంబున తానుగ్రహించిన యే ద్రవ్యముకలదో ఆద్రవ్యమును రెట్టింపుచేసి తిరిగి యిచ్చినవాడాయెను

శ్లో॥ ప్రోవాచతౌతతోరాజా గచ్ఛసాధోనిజాశ్రమం।
రాజానంప్రణిపత్యాహ గంతవ్యంత్వత్ప్రసాదతః॥

తా॥ సత్కారము జరిగిన తర్వాత రాజు ఓ వర్తకులారా! మీయింటికి వెళ్లుమా అని పలికెను. పిమ్మట ఆవర్తకులు రాజునకు నమస్కరించి మీయనుగ్రహమువలననింటికివెళ్ళుటకలిగినదనిపలికెను.

ఇతి తృతీయోఽధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ చతుర్థోఽధ్యాయ ప్రారంభః. ♦—

సూతః॥ శ్లో॥ యాత్రాంకృత్వాతతస్సాధు ర్మంగళాచారపూర్వకం।
బ్రాహ్మణేభ్యోధనందత్వా యయౌస్వనగరంప్రతి॥

తా॥ అటుపిమ్మట సాధువు మంగళాచారపూర్వకముగ యాత్రజేసి యాసమయంబున బ్రాహ్మణులకు ధనమునిచ్చి తనపట్టణమునకుఁ బయలు వెడలెను.

శ్లో॥ కియద్దూరంగతేసాధౌ సత్యనారాయణఃప్రభుః।
జిజ్ఞాసాంకృతవాన్సాధో నౌకాయామస్తికింతవ॥

తా॥ కొంతదూరము వెళ్ళగా నప్పుడు శ్రీసత్యనారాయణ ప్రభువు వీని మనస్సును పరీక్షింపదలంపుతో విరాగిగా నచ్చటికివచ్చి ఓసాధూ! నీపడవలోనున్న సరుకేమిటియని యడిగెను.

శ్లో॥ తతోమహాజనౌమత్తౌ హేళయాచప్రహస్యవై।
కథంపృచ్ఛసిభోదండిన్ ముద్రాంనేతుంకిమిచ్ఛసి॥

తా॥ అప్పుడా వర్తకులు మత్తులయి పరిహాసము జేయుచు నోసన్యాసీ! డబ్బుదీసికొనుతలంపు నీకున్నదిగాబోలు మాపడవలో,

శ్లో॥ లతాపత్రాదికంచైవ వర్తతేతరణౌమమ ।
ఇత్యుక్తంవచనంశ్రుత్వా సత్యంభవతుతేవచః॥

తా॥ అనంతర మావర్తకులు పారబ్ధవశముచేత ఆనావయందు ఆకులు, తీగెలున్నవియని యనఁగా నాపరుషవాక్కును స్వామి విని నీవు పలికినమాట సత్యమగుగాక యని పలికెను.

శ్లో॥ ఏవముక్త్వాగతశ్శీఘ్రం దండీతస్యసమీపతః ।
కియద్దూరంతతోగత్వా స్థితస్సింధుసమీపతః॥

తా॥ ఈప్రకారము సన్యాసి ఆవర్తకుని దగ్గఱ పలికినవాఁడై సముద్రమునకు కొంతదూరమువెళ్ళి ఆసముద్రసమీపమందే యుండినవాఁడాయెను.

శ్లో॥ గతేదండినిసాధుశ్చ కృతనిత్యక్రియస్తథా ।
ఉత్థితాంతరణీందృష్ట్వా విస్మయంపరమంయయౌ॥

తా॥ అంతట సాధువు నిత్యకృత్యముల తీర్చుకొని మిక్కిలి తేలియున్న పడవనుజూచి గొప్పయాశ్చర్యమును బొందెను.

శ్లో॥ దృష్ట్వాలతాదికంచైవ మూర్ఛితోన్యపతద్భువి ।
లబ్ధసంజ్ఞోవణిక్పుత్ర స్తతశ్శోకాన్వితోఽభవత్॥

తా॥ పడవయందున్న యాకులు, తీగెలు, మొదలయినవానినిఁ జూచి తానుంచిన పెట్టెలు లేకపోవడముచేత మూర్ఛను బొందినవాఁడై భూమియందుపడి దొర్లుచు కొట్టుకొనుచు తెలివిలేక కొంత సేపుండిన పిమ్మట తెలివితెచ్చుకొని ధనమంతా వృథాగా ఆకులయి పోయెనని విచారముగలవాఁడై యుండెను.

శ్లో॥ తదాతుదుహితఃకాంతో వచనంచేదమబ్రవీత్ ।
కిమర్థంక్రియతేశోక శ్శాపోదత్తశ్చదండినా॥

తా॥ ఆవిచారమును బొందుకాలమందు అల్లుడు ఓమామా! యెందుకు దుఃఖించడము, ఆసన్యాసిచే శాపమియ్యబడినదని పలికెను,

శ్లో॥ శక్యతేతేనసర్వంహి కర్తుంచాత్రినసంశయః।
అతస్తంశరణంయామో వాంఛితార్థోభవిష్యతి॥

తా॥ ఈసన్యాసి సమస్తమును సృష్టించుటకును, సంహారించుటకును, సమర్థుడు కనుక వారిని శరణుజొచ్చెదము. వారు మనదుఃఖమును నిశ్చయముగ పోగొట్టగలరు. మన కోరికలు సిద్ధింప కలవని అల్లుడనెను.

శ్లో॥ జామాతుర్వచనంశ్రుత్వా తత్సకాశంగతోవణిక్।
దృష్ట్వాచదండినంభక్త్యా నత్వాప్రోవాచసాదరమ్॥

తా॥ అల్లునియొక్క వాక్యమునువిని సన్యాసియొద్దకు వెళ్ళిచూచి భక్తిచే నమస్కరించి ఆదరణతో కూడినవాడై ఒకవాక్యముపలికెను.

శ్లో॥ క్షమస్వచాపరాధంమే యదుక్తంతవసన్నిధౌ।
ఏవంపునఃపునర్నత్వా మహాశోకాకులోఽభవత్॥

తా॥ ఓయీ! మహానుభావా! మీవద్ద యే యనృతవాక్యము పలుకబడెనో దానినంతను క్షమింపుమని మాటి మాటికి నమస్కరించుచున్నవాడై గొప్పదుఃఖమును బొందుచున్నవాడాయెను.

శ్లో॥ ప్రోవాచవచనందండీ విలపంతంవిలోక్యచ।
మారోదీశ్శృణుమద్వాక్యం మమపూజాబహిర్ముఖః।
మమాజ్ఞయాచదుర్బుద్ధే లబ్ధందుఃఖం ముహుర్ముహుః॥

తా॥ పిమ్మట సన్యాసి దుఃఖించుచుండిన వర్తకునిజూచి ఓ వర్తకుడా! నామాటలనువినుము. ఓజ్ఞానహీనుడా! నాపూజను విడిచివేయుటచే నాయాజ్ఞవలన మాటి మాటికి దుఃఖము సంభవించుచున్నదని చెప్పెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వాభగవద్వాక్యం స్తుతింకర్తుంసముద్యతః॥

తా॥ ఆభగవంతుని వాక్యమునువిని స్తోత్రమును జేయుటకు ప్రారంభించెను.

సాధుః॥ శ్లో॥ త్వన్మాయామోహితాస్సర్వే బ్రహ్మాద్యాస్త్రిదివౌకసః।
నజానంతిగుణానూపం తవాశ్చర్యమిదంప్రభో॥

తా॥ ఓయి మహానుభావా! బ్రహ్మమొదలగు సమస్త దేవ

తలు దేవరవారిమాయచే మోహపెట్టఁబడి యాశ్చర్యకరమగు నీ సగుణ రూపమునే తెలిసికొనలేకయుండగా నిర్గుణస్వరూపము మనోవాక్కుల కందనిది తెలిసికొనశక్యముగాదు స్వామీ.

శ్లో॥ మూఢోఽహం త్వాంకథంజానే మోహిత స్తవమాయయా।
ప్రసీదపూజయిష్యామి యథావిభవవి_స్తరమ్॥

తా॥ నేను మూఢుఁడను. దేవరవారి మాయచే మోహింపఁబడి మిమ్ము నేప్రకారము తెలిసికొనఁగలను? ఇంతటినుంచి నావిభవము కొలఁది మిమ్ము పూజించెదను. అనుగ్రహింపుము.

శ్లో॥ పురావి_త్తంచయత్సర్వ మనుగృహ్ణీష్వతత్ప్రభో ।
పాహిమాం పుండరీకాక్ష త్వా మద్యశరణాగతమ్।
శ్రుత్వాభ_క్తియుతంవాక్యం పరితుష్టోజనార్దనః।
వరంచవాంఛితందత్వా తత్రైవాంతరధీయత॥

తా॥ ఓ స్వామీ! నాపూర్వధనము నంతను అనుగ్రహింపుము. (ఇమ్ము) ఓ పుండరీకాక్షా! శరణాగతుఁడనైన నన్ను నిప్పుడు రక్షింపుము. అను భ_క్తిగల యావర్తకుని వాక్యమును విని సంతోషము గలవాఁడై విష్ణుమూర్తి కోరిన కోరికల నిచ్చి అచ్చటనే కనఁబడకపోయెను.

శ్లో॥ తతోనావంసమారుహ్య దృష్ట్వావి_త్తప్రపూరితాం ।
కృపయాసత్యదేవస్య సఫలంవాంఛితంమమ।
ఇత్యుక్త్వాస్వజనై స్సార్థం పూజాంకృత్వాయథావిధి ।
హర్షేణచాభవత్పూర్ణ స్సత్యదేవప్రసాదతః ।
నావంసంయోజ్యకృతవాన్ స్వదేశగమనంతతః॥

తా॥ అంతర్ధానమయిన తర్వాత నావను యెక్కి ధనముచే నిండిన దానిగాజూచి సత్యనారాయణుని దయచేత నాకోరిక ఫలయు_క్తమయినదని పలికి తన స్వజనులతోకూడి సత్యవ్రతముజేసి సత్యనారాయణుని యనుగ్రహమువలన సంతోషముగలవాఁడై పిమ్మటఆఓడను చక్కగా సిద్ధపరచి తన దేశమునకు ప్రయాణము చేసెను.

శ్లో॥ సాధుర్జామాతరంప్రాహ పశ్యరత్నపురీంమమ।
దూతంచప్రేషయామాస నిజవిత్తస్యరక్షకమ్॥

తా॥ పిమ్మట ఓయల్లుడా! నారత్నపురిని చూడుమని వర్తకుడు అల్లునిగూర్చి పలికెను. తన ధన సంరక్షకుడయిన భటుని ఆపట్టణముకు బంపెను.

శ్లో॥ దూతోఽసౌనగరంగత్వా సాధుభార్యాంవిలోక్యచ।
ప్రోవాచాత్మహితంవాక్యం నత్వాబద్ధ్వాంజలిస్తదా॥

తా॥ తరువాత ఆభటుడు నగరముకువెళ్ళి వర్తకునిభార్యను జూచి నమస్కరించి అంజలిని పట్టినవాడై ఆమెకు హితమైన వాక్యమును బలికెను.

శ్లో॥ నికటేనగరస్యైవ జామాత్రాసహితోవణిక్।
ఆగతోబంధువర్గైశ్చ స్వజనైర్బహుభిర్యుతః॥

తా॥ ఓయమ్మా! మీపెనిమిటియయిన వర్తకుడు మీయల్లునితోకూడి బంధువులతోను, నౌకర్లతోను,కూడినవారయి గ్రామసమీపమునకు వచ్చియున్నారని పలికెను.

శ్లో॥ శ్రుత్వాదూతముఖాద్వాక్యం మహాహర్షవతీసతీ।
సత్యపూజాంతతఃకృత్వా ప్రోవాచతనుజాంప్రతి॥

తా॥ సంతోషముగల ప్రతివ్రతయైన యావర్తకుని భార్య భటునివల్ల ఆవార్తనువిని వెంటనే సత్యనారాయణ పూజనుచేసి కుమార్తెను గూర్చి ఒకానొక వాక్యమును పలికెను.

శ్లో॥ వ్రజామిశీఘ్రమాగచ్ఛ సాధుసందర్శనాయచ।
ఇతిమాతృవచశ్శ్రుత్వా వ్రతంకృత్వాసమాప్యచ।
ప్రసాదంచ పరిత్యజ్య గతాసాఽపిపతింప్రతి॥

తా॥ ఓ యమ్మాయీ! నేను నీతండ్రిగారిని జూచుటకు వెళ్లుచున్నాను. నీవును శీఘ్రముగా సత్యనారాయణ పూజను చేసికొని రమ్మని, తల్లి కుమార్తెతో చెప్పగా ఆమె విని వెంటనే సత్యనారాయణ పూజను చేసికొని ప్రసాదమును విడిచివేసి పెనిమిటిని జూచుటకు వెళ్లినదాయెను.

శ్లో॥ తేసరుష్టస్సత్యదేవో భర్తారంతరణీంతదా ।
సంహృత్యచధనైస్సార్థం జలేతస్మిన్నమజ్జయత్ ॥

తా॥ ఆకుమార్తె ప్రసాదమును వదలిపెట్టుటచే సత్యనారాయణమూర్తి కోపముగలవాఁడై ఆచిన్నదాని పెనిమిటిని నావను కనపడకుండాచేసి సముద్రముయొక్క ఉదకమందు ధనములతోకూడా ముంచివేసిన వాఁడాయెను.

శ్లో॥ దృష్ట్వాతథావిధాంనావం కన్యాంచ బహుదుఃఖితాం ।
భీతేనమనసాదుఃఖ మాపురాశ్చర్యమంతికాః॥

తా॥ దగ్గఱనున్న జనులు మునిగిన నావను, దుఃఖముగల యా చిన్నదానినిజూచి వర్తకుఁడు తమవలన కలిగినదని యనునేమో యనుభయముచేత దుఃఖమును అకస్మాత్తుగా సంభవించినదని యాశ్చర్యమును బొందుచుండిరి.

శ్లో॥ చింతమానాశ్చతేసర్వే బభూవుస్తీరవాసకాః ।
తతోలీలావతీకన్యాం దృష్ట్వాసావిహ్వలాభవత్ ॥

తా॥ ఆతీరవాసులందఱు విచారముగలవారై యుండిరి. పిమ్మట లీలావతి యను నావర్తకునిభార్య దుఃఖమును బొందుచుండిన కుమార్తెనుజూచి పరవశురాలై యుండెను.

శ్లో॥ విలలాపాతిదుఃఖేన భర్తారంచేదమబ్రవీత్ ।
ఇదానీంనౌకయాసార్థం కథంసోఽభూదలక్షితః॥

తా॥ అనంతరమం దతనిభార్య అతిదుఃఖము గలదయి దుఃఖించెను. పెనిమిటినిగూర్చి ఒకానొక వాక్యమును పలికెను. అది యేమనఁగా యిప్పుడు మన యల్లుడు ఓడతోకూడా కనపడకుండా యేహేతువచే నుండెను.

శ్లో॥ నజానేకస్యదేవస్య హేలయానౌశ్చసాహృతా।
సత్యదేవస్యమాహాత్మ్యం జ్ఞాతుంవక్తుంనశక్యతే॥

తా॥ ఏదేవుని విలాసముచేత యీప్రకారము జరిగినదో తెలియకున్నది. సత్యదేవునియొక్క మహిమను తెలిసికొని జెప్పుటకు యెవరితరముగాదని పలికెను.

శ్లో॥ ఇత్యుక్త్వావిలలాపైవ తతశ్చస్వజనైస్సహా।
తతోలీలావతీకన్యాం క్రోడీకృత్వారురోదహా॥

తా॥ ఈ ప్రకారము పెనిమిటినిగూర్చి పలికి బంధుజనముతో కూడా లీలావతి యను వర్తకుని భార్య కుమార్తెను కౌగలించుకొని యల్లునిగూర్చి దుఃఖించెను.

శ్లో॥ తతఃకలావతీకన్యా నష్టేస్వామినిదుఃఖితా।
గృహీత్వాపాదుకాంతస్య హ్యనుగంతుంమనోదధా॥

తా॥ పిమ్మట కళావతి యను సావర్తకుని కుమార్తె పెనిమిటి కనపడని హేతువువలన ఆచిన్నది మఱియొక తలంపుతో భర్త యొక్క పాదరక్షలను తీసికొని సహగమనము చేయుట కొఱకు ప్రయత్నించెను.

శ్లో॥ కన్యాయాశ్చరితందృష్ట్వా సభార్యస్స్వజనోవణిక్।
అతిశోకేనసంతప్తః చింతయామాసధర్మవిత్॥

తా॥ భార్యా బంధువులతో గూడినవాఁడై ధర్మము తెలిసిన యావర్తకుఁడు కన్యయొక్క సహగమన ప్రయత్నముచూచిమిక్కిలి దుఃఖముగలవాఁడై విచారించెను.

శ్లో॥ హృతంవాసత్యదేవేన భ్రాంతోఽహంసత్యమాయయా।
సత్యపూజాం కరిష్యామి యథావిభవవిస్తరం।
ఇతిసర్వాన్సమాహూయ కథయిత్వామనోగతం।
నత్వాచదండవద్భూమౌ సత్యదేవంపునఃపునః॥

తా॥ సత్యనారాయణ మూర్తిచే నపహరింపఁబడినదా! నేనతని మాయచే భ్రాంతి నందితినా! అని విచారించి సత్యనారాయణ మూర్తియొక్క మహిమచేతనే కలిగినదని నిశ్చయించుకొని సత్యనారాయణపూజను నావైభవమునకు తగినట్లు చేయగలనని యిది వఱకువలె మనస్సుననుంచిన మఱపు కలుగునని సాక్ష్యము కొఱకు నందఱను పిలిచి చెప్పి వర్తకుఁడు యాదేవునకు నమస్కారముచేసి యూరకుండెను.

శ్లో॥ తత స్తుష్టస్సత్యదేవో దీనానాం పరిపాలకః ।
జగాదవచనం చైనం కృపయా భక్తవత్సలః॥

తా॥ ఆప్రకారము సంతోషించు మిక్కిలిసత్యాత్మ దీనులను రక్షించునట్టియున్ను భక్తులయందు ప్రేమగల సత్యనారాయణమూర్తి వారి భక్తికి మెచ్చి దయచేత వొకానొక వాక్యమును పలికెను.

శ్లో॥ త్యక్త్వాప్రసాదం తే కన్యాపతిం ద్రష్టుంసమాగతా ।
అతోఽదృష్టోఽభవత్తస్యాః కన్యకాయాఃపతిర్ధ్రువమ్॥

తా॥ నీకుమార్తె ప్రసాదమును భక్షింపక నిరాకరించి వచ్చినది. అందువల్ల నీయల్లుడు కనబడుటలేదు, నిశ్చయము.

శ్లో॥ గృహంగత్వాప్రసాదంచ భుక్త్వాసాయాతిచేత్పునః ।
లబ్ధభర్త్రీసుతాసాధో భవిష్యతినసంశయః॥

తా॥ ఓవర్తకుండా! నీకుమార్తె యింటికి వెళ్ళి ప్రసాదమును భుజించి తిరిగి వచ్చినయెడల పెనిమిటిని చూడగలదు. సంశయము లేదు అని పలికెను.

శ్లో॥ కన్యకాతాదృశంవాక్యం శ్రుత్వాగగనమండలాత్ ।
క్షిప్రంతదాగృహంగత్వా ప్రాసాదమనుభుజ్యచ।
సాపశ్చాత్పునరాగత్వా దదర్శసజనంపతిమ్॥

తా॥ ఆచిన్నది యాకాశమునుండి వాక్యమును విని త్వరలో యింటికి వెళ్లి ప్రసాదమును భుజించి తిరుగవచ్చి పరివారముతో గూడిన పెనిమిటిని జూచెను.

శ్లో॥ తతఃకలావతీకన్యా జగాదపితరంప్రతి ।
ఇదానీం స్వగృహంయాహి విళంబంకురుషేకథమ్॥

తా॥ పిమ్మట కళావతియను చిన్నది తండ్రినిగూర్చి ఆలస్యముచేయక యింటికి వెళ్లుదమని పలికెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వాకన్యకావాక్యం సంతుష్టోఽభూద్వణిక్సుతః।
పూజనంసత్యదేవస్య కృత్వావిధివిధానతః ।
ధనైర్బంధుగణైస్సార్థం జగామనిజమందిరమ్॥

తా॥ పిదప నాచిన్నదాని వాక్యమును విని వర్తకుండుసంతో

షయుక్తుఁడై సత్యనారాయణ వ్రతముజేసి ధనముతో బంధుజనము తోఁగూడి తనయింటికి వెళ్ళెను.

శ్లో॥ పౌర్ణమాస్యాంచ సంక్రాంతౌ కృతవాన్సత్యపూజనం।
ఇహలోకేసుఖంభుక్త్వా చాంతేసత్యపురంయయౌ॥

తా॥ అది మొదలు వర్తకుఁడు ప్రతిపూర్ణిమా సంక్రాంతుల యందు సత్యనారాయణ వ్రతమును జేసినవాఁడై ఇహలోకమందు సుఖము ననుభవించి జీవితాంతంబున వైకుంఠముచేరెను.

ఇతి చతుర్థోఽధ్యాయ స్సమాప్తః.

## అథ పంచమోఽధ్యాయః.

సూతః॥ శ్లో॥ అథాన్యత్సంప్రవక్ష్యామి శృణుధ్వంమునిసత్తమాః।
ఆసీత్తుంగధ్వజోరాజా ప్రజాపాలనతత్పరః॥

తా॥ అనంతరము ఓ మునిశ్రేష్ఠులారా! మఱియొక కథను చెప్పుచున్నాను వినుండు. ప్రజలనుచక్కఁగా పరిపాలించుచున్న తుంగ ధ్వజుడను నొకానొక రాజు గలడు.

శ్లో॥ ఏకదాసవనంగత్వా హత్వాబహువిధాన్పశూన్।
ఆగత్యబిల్వమూలంచ దృష్ట్వాసత్యస్యపూజనమ్॥

తా॥ ఆరాజు ఒకానొకప్పుడు వనమునుగూర్చి వెళ్ళి అనేక విధములయిన మృగములను జంపి ఒక మారేడు వృక్షమూలమునకు వచ్చి సత్యనారాయణమూర్తియొక్క వ్రతమును జూచెను.

శ్లో॥ గోపాఃకుర్వంతిసంతుష్టా భక్తియుక్తాస్సబాంధవాః।
రాజాదృష్ట్వాతుదర్పేణ నగత్వాతంననామసః॥

తా॥ గొల్లలు బంధువులతోఁగూడి సత్యనారాయణ వ్రతమును మిక్కిలి భక్తిశ్రద్ధలతో కూడినవారై సంతోషయుక్తముగ జేయుచున్నారని ఆరాజు తెలిసికొని గర్వముచేతను ఆసత్యదేవుని గూర్చి ఆస్థలమునకు వెళ్ళిన్ని నమస్కరించని వాఁడాయెను.

శ్లో॥ తతో గోపగణాస్సర్వే ప్రసాదంనృపసన్నిధౌ ।
సంస్థాప్యపునరాగత్య భుక్త్వాస్సర్వేయధేప్సితమ్॥

తా॥ పిమ్మట గోపాలకులందఱు రాజు వచ్చినాడను గౌరవముతో ప్రసాదమును రాజు సమీపమునందుంచి తిరిగివచ్చి స్వేచ్ఛగా భుజించిరి.

శ్లో॥ తతఃప్రసాదంసంత్యజ్య రాజాదుఃఖమవాపసః ।
తస్యపుత్రశతంనష్టం ధనధాన్యాదికంచయత్॥

తా॥ అటుపిమ్మట ఆరాజు ప్రసాదమును పరిహరించి చాలా దుఃఖమును బొందెను. ఆదుఃఖమేమనగా నతనికినూఱుగురుపుత్రులు నశించిరి. ఇదిగాక ధనధాన్యములు మొదలగునవికూడానష్టమాయెను.

శ్లో॥ సత్యదేవేనతత్సర్వం నాశితంమమనిశ్చితం ।
అతస్తత్రైవగచ్ఛామి యత్రదేవస్యపూజనం ।
మనసేతివినిశ్చిత్య యయౌగోపాలసన్నిధిమ్॥

తా॥ పిమ్మట ఆరాజు సత్యదేవుని ప్రసాదమునువిడిచివేయుట చేతనే తనయొక్క పుత్రులును, తనయొక్క ధనములును యావత్తు నశించినవని తెలిసికొని ఆసత్యవ్రతమునుచేయు స్థలమునకు వెళ్లెను.

శ్లో॥ తతోఽసౌసత్యదేవస్య పూజాంగోపగణైస్సహ ।
భక్తిశ్రద్ధాన్వితోభూత్వా చకారవిధినానృపః॥

తా॥ వారిసమీపమునకు వెళ్లిన తర్వాత ఆ గోపాలకులతో గూడినవాఁడై యారాజు సత్యదేవునియొక్క వ్రతము మిక్కిలి భక్తి శ్రద్ధలతో కూడినవాఁడై కల్పోక్తవిధిగా చేసెను.

శ్లో॥ సత్యదేవప్రసాదేన ధనపుత్రాన్వితోఽభవత్ ।
ఇహలోకేసుఖంభుక్త్వా చాంతేసత్యపురంయయౌ॥

తా॥ ఈవ్రతము జేసిన తర్వాత ధన పుత్రులతోకూడా కూడినవాఁడై ఇహలోకంబున సకల సుఖముల ననుభవించిఅంతకాలమందు వైకుంఠమును బొందెను.

శ్లో॥ యఇదంకురుతేసత్య వ్రతంపరమదుర్లభం ।

శృణోతి చ కథాం పుణ్యాం భక్తియుక్త ఫలప్రదాం।
ధనధాన్యాదికం తస్య భవేత్సత్యప్రసాదతః॥

తా॥ ఎవరు మిక్కిలి భక్తియుక్తులై యీసత్యవ్రతమును చేయునో పవిత్రమయిన యీకథను వినునో వానికి సత్యదేవుని యనుగ్రహము వలన ధనధాన్యాది సంపత్తులు కలుగును.

శ్లో॥ దరిద్రో లభతే విత్తం బద్ధో ముచ్యేత బంధనాత్ ।
భీతో భయాత్ప్రముచ్యేత సత్యమేవ న సంశయః॥

తా॥ దరిద్రుడుగా నుండు మనుష్యుడు యీవ్రతమును జేసి నట్లాయెనా ధనమును బొందును. సంకెళ్ళు వేయబడినవాడు చేసి నట్లాయెనా సంకెళ్లనుండి విడువబడును. భయముగలవాడు చేసినట్లాయెనా భయమునుండి విడువబడును. నిజము సంశయము లేదు.

శ్లో॥ ఈప్సితంచ ఫలంభుక్త్వా చాంతే సత్యపురం వ్రజేత్ ।
ఇతి వః కథితం విప్రాః సత్యనారాయణవ్రతమ్॥

తా॥ ఓమునులారా ! ఈవ్రతము నాచరించువారు కోరిన కోరికల ననుభవించి అంత్యకాలంబున వైకుంఠము జేరుదురు. ఈప్రకారము మీకు సత్యవ్రతమును జెప్పితిని.

శ్లో॥ యత్కృత్వా సర్వదుఃఖేభ్యో ముక్తో భవతి మానవః ।
విశేషతః కలియుగే సత్యపూజా ఫలప్రదా ।
కేచిత్కాలం వదిష్యంతి సత్యమీశం తమేవ చ।
సత్యనారాయణం కేచి త్సత్యదేవం తథాఽపరే॥

తా॥ సత్యవ్రతమును జేసిన మనుష్యుడు సర్వదుఃఖముల నుండి విడువబడిన వాడగును. ఈవ్రతము కలియుగంబున విశేష ఫలము నిచ్చునది. ఈదేవుని కొందఱు ఈశ్వరుడనిన్ని, కొందఱు సత్యనారాయణుడనిన్ని, మఱికొందరు సత్యదేవుడనిన్ని పిలుతురు.

శ్లో॥ నానారూపధరో భూత్వా సర్వేషామీప్సితప్రదః ।
భవిష్యతి కలౌ సత్య వ్రతరూపీ సనాతనః॥

తా॥ సత్యనారాయణమూర్తి అనేక రూపములను ధరించి,

సమస్తజనులకు కోరిన కోరికల నిచ్చువాఁడై కలియుగంబున సత్య వ్రతరూపమును ధరించి యుండెను.

శ్లో॥ కథాంవా శ్రుణుయాద్యస్తు ఏ శ్చైద్వా వ్రతముత్తమం।
తస్యసశ్యంతిపాపాని సత్యదేవప్రసాదతః॥

తా॥ ఈకథ నెవ్వరు వినుచున్నారో, ఎవ్వరీవ్రతమును జూచుచున్నారో, వారి కందఱికినిగూడ సత్యదేవుని ప్రసాదమువలన సమస్త పాపములు పరిహరింపఁబడును.

శ్లో॥ ఇత్థమాపంచమాం శ్రుత్వా కామ్యాఽకామ్యఫలాన్వితాం।
ప్రసాదమాహాత్మ్యయుతాం కథాంబంధుజనైస్సహా॥
తతోభోజయితవ్యాస్తై బంధుభిస్సహబ్రాహ్మణైః॥
తతశ్శ్రిణ్వన్కథాం శేషాం రాత్రిమాప్రాతరావహేత్॥

తా॥ ఈ ప్రకారము పంచమాధ్యాయ పర్యంతము కామ్యములయినటువంటివిన్ని మోక్షప్రదమయినటువంటివిన్ని, ఫలములతోకూడిన అనఁగా కామ్యఫల మోక్షఫలములను జెప్పునట్టి ప్రసాద మహాత్మ్యముతో కూడిన పై కథలను బంధుజనులతోఁగూడ గూడుకొని విని పిమ్మట బ్రాహ్మణ సమారాధనము బంధుసమారాధనము చేయవలయును. పిమ్మట ఆఱవ అధ్యాయము మొదలు మిగిలిన కథలను వినుచు రాత్రిని గడపవలయును.

ఇతి శ్రీ స్కాందపురాణే రేవాఖండే పంచమోఽధ్యాయ స్సమాప్తః.

---

## అథ షష్ఠాధ్యాయః.

శ్లో॥ అథాన్యత్సంప్రవక్ష్యామి శ్రుణుధ్వంమునిసత్తమాః।
పురారామోవనంయాతో వర్షాణ్యేవచతుర్దశ॥

టీ॥ హేమునిసత్తమాః= ఓ మునిశ్రేష్ఠులారా! అథ=అనంతరము, అన్యత్ = మఱియొక కథను, సంప్రవక్ష్యామి=చెప్పెదను, శృణుధ్వం= వినుడు, పురా= పూర్వకాలమందు, చతుర్దశ=పదునాలుగు, వర్షాణి= సంవత్సరములు, రామః = రాముఁడు, వనం = వనమును గూర్చి, యాతః = వెళ్లెను.

తా॥ ఓ మునులారా! మఱియొక కథను చెప్పెద వినుఁడు పూర్వకాలమందు రాముఁడు పదునాలుగు సంవత్సరములు వనవాసము చేసెను. అది యెట్లనిన.

శ్లో॥ న్యవసత్పంచవట్యాంచ ససీతస్సహలక్ష్మణః।
తత్రైవ వసత స్తస్య రామస్యవిదితాత్మనః।
రావణేనహృతాభార్యా భిక్షురూపధరేణచ॥

టీ॥ ససీతః= సీతతోకూడిన, సహలక్ష్మణః = లక్ష్మణునితోకూడిన రాముఁడు, పంచవట్యాం= పంచవటీక్షేత్రమందు, న్యవసత్ =ఉండెను. తత్రైవ= ఆపంచవటీతీరమందె, వసతః=ఉన్న, తస్య= ఆ, విదితాత్మనః= ఆత్మజ్ఞానముగల, రామస్య= రామునియొక్క, భార్యా = భార్య, భిక్షురూపధరేణ= సన్యాసిరూపము ధరించిన, రావణేన = రావణుని చేత, హృతా= హరించబడినది,

తా॥ రాముడట్లు వనవాసముచేయునప్పుడు సీతాదేవి లక్ష్మణులతోగూడ పంచవటీక్షేత్రమందుండెను. అచ్చటనుండగా ఆత్మజ్ఞానముగల రామునియొక్క భార్యను రావణుఁడు సన్యాసిరూపమును ధరించి యెత్తుకొనిపోయెను.

శ్లో॥ తేనదుఃఖేనరామోఽసౌ మోహమభ్యగమ త్తదా।
వ్రజన్జటాయుషంభూమౌ దదర్శవిగతాయుషమ్॥

టీ॥ అసౌ=ఈ, రామః=రాముఁడు, తదా=అప్పుడు, తేన= ఆభార్యను హరించుటయను, దుఃఖేన=దుఃఖముచేత, మోహం= సంసారభ్రాంతిని, అగమత్ = పొందెను. వ్రజన్= వెతుకుటకువెళ్ళుచూ, భూమౌ= భూమియందు, విగతాయుషం = పోయిన ఆయుర్దాయముగల, జటాయుషం= జటాయువను గద్దను, దదర్శ= చూచెను.

తా॥ ఈరాముఁడు భార్య కనపడకుండుటచేతనయిన దుఃఖముచేత జ్ఞానియయినను లోకానుసరణముచేత సంసారభ్రాంతి కలవాడై తన భార్యను వెదకుటకు బయలుదేరి మార్గమధ్యమందు చచ్చుటకు సిద్ధముగానున్న జటాయువును జూచెను.

శ్లో॥ కబంధోనిహతఃపశ్చా ద్భ్రమన్నారణ్యమధ్యగః।

సుగ్రీవేణసమంతస్య సఖిత్వంసమజాయత ।
వానరాణామనీకాని సాహాయ్యార్థం ప్రేషితానిచ॥

టీ॥ పశ్చాత్ = అనంతరము, భ్రమత్ =వెతుకుచూ, అరణ్యామధ్యగః= అరణ్యామధ్యమందున్న, కబంధః=కబంధుడను రాక్షసుఁడు, నిహతః=కొట్టబడెను. తస్య=అతనికి, సుగ్రీవేణసమం = సుగ్రీవునితో కూడ, సఖిత్వం=స్నేహము, సమజాయత= కలిగెను. వానరాణాం = వానరుల యొక్క, అనీకాని=సేనలు, సాహాయ్యార్థం=సహాయము నిమిత్తము, ప్రేషితాని= పంపఁబడినవి.

తా॥ పిమ్మట సీతను వెతుకుచు అరణ్యమందున్న కబంధుడను రాక్షసుని జంపెను. పిదప సుగ్రీవుడను వానరరాజుయొక్క స్నేహము కలిగి వానివలన పంపఁబడిన వానరసైన్యమును గ్రహించెను.

శ్లో॥ తతోహనుమతాదృష్టా లంకోద్యానేతుజానకీ ।
రామస్యాజ్ఞాంనివేద్యాథ దూతకర్మమహత్కృతమ్॥

టీ॥ తతః= సేనలపంపినతర్వాత, హనుమతా = హనుమంతునిచే, జానకీ= సీత, లంకోద్యానే, లంక=లంకాపట్టణముయొక్క, ఉద్యానే= ఉద్యానవనమందు, దృష్టా= చూడఁబడినది. అథ=అనంతరము, రామస్య= రామునియొక్క, ఆజ్ఞాం= ఆజ్ఞను, నివేద్య= తెలియపర్చి, మహత్ =గొప్పదయిన, దూతకర్మ=దూత్యము, కృతం=చేయఁబడినది.(అనఁగా చెప్పినపనికి భంగములేకుండ నధికకార్యమును సాధించుట)

తా॥ పిమ్మట నాసేనలో నొకడయిన హనుమంతుడు లంకాపట్టణము ప్రవేశించి ఉద్యానవనమందుసీతాదేవినిజూచెను. ఆప్రకారము సీతనుగూర్చి యింకాశత్రుబలాబలములను దెలిసికొనుట మొదలగు కార్యములు భటుఁడు చేయవలసిన కర్మముచేసెను.

శ్లో॥ సమేత్యరామస్యపున స్సర్వంతత్రనివేదితం ।
అథశ్రుత్వారామచంద్రో వాక్యతశ్చహనూమతః॥

టీ॥ పునఃసమేత్య= తిరిగివచ్చి, తత్ర= ఆలంకయందయిన, సర్వం= సమస్తము, రామస్య=రామునికి, నివేదితం= తెలుపఁబడినది. అథ=అనం

తరము, రామచంద్రః=రాముఁడు, హనూమతః=హనుమంతునియొక్క, వాక్యతః=వాక్యమువల్ల, శ్రుత్వా=విని,

తా॥ పిమ్మట తిరిగివచ్చి రామునికి ఆలంకయందున్న సంగతుల నన్నిటిని జెప్పెను. పిదప రాముఁడా సంగతులు విని హనుమంతుని వాక్యప్రకారము

శ్లో॥ సుగ్రీవప్రముఖైస్సార్థం ప్రస్థానంసమరోచయత్ ।
నగత్వాశనకైస్తీరం తతోనదనదీపతేః॥

టీ॥ సుగ్రీవప్రముఖైస్సార్థం=సుగ్రీవుఁడు మొదలయిన వారితో కూడా, ప్రస్థానం=ప్రయాణమును, సమరోచయత్=ఇష్టపడెను. తతః=ఆప్రయాణమైన తర్వాత, శనకైః=మెల్లగా, సః=ఆరాముఁడు, నదనదీపతేః, నద=పురుషనదులకున్ను, నదీనదులకును, పతేః = ప్రభువైన సముద్రముయొక్క, తీరం=ఒడ్డును, గత్వా=పొంది—

తా॥ సుగ్రీవుఁడు మొదలయిన వానరులతో మెల్లగా సముద్రతీరము చేరెను.

శ్లో॥ దృష్ట్వాతుదుస్తరంరామో విస్మితోఽభూద్విశేషతః ।
ప్రోత్ఫుల్లనయనోభూత్వా లక్ష్మణంవాక్యమబ్రవీత్॥

టీ॥ రామః=రాముఁడు, దుస్తరం= దాటశక్యముగాని సముద్రమును, దృష్ట్వా=జూచి, విశేషతః=మిక్కిలి, విస్మితః = ఆశ్చర్యముగలవాఁడై, అభూత్ = ఉండెను. ప్రోత్ఫుల్ల = మిక్కిలి వికసించిన, నయనః=నేత్రములు కలవాఁడు, భూత్వా= అయి,లక్ష్మణం=లక్ష్మణుని, వాక్యం=వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా॥ అటు పిమ్మట సముద్రమునుదాట నశక్యమైన దానిగా దెలిసికొని మిక్కిలి యాశ్చర్యముగలిగిన లక్ష్మణునితో నొకానొక వాక్యమును బలికెను.

శ్లో॥ సౌమిత్రేకేనపుణ్యేన తరిష్యేవరుణాలయమ్॥

టీ॥ హేసౌమిత్రే= ఓలక్ష్మణుఁడా, వరుణాలయం= సముద్రమును కేన=యే, పుణ్యేన=పుణ్యముచేత, తరిష్యే= దాటెదను.

తా॥ ఓలక్ష్మణా! యేపుణ్యముచేత నీసముద్రముదాటగలను.

లక్ష్మణః॥ శ్లో॥ ఆదిదేవ స్త్వమేవాసి పురాణపురుషోత్తమ॥

టీ॥ హేపురాణపురుషోత్తమ= ఓప్రాచీన పురుషశ్రేష్ఠుఁడా, త్వమేవ=నీవే, ఆదిదేవః=ప్రధానదైవము, అసి= అయితివి.

తా॥ ఇట్లని రాముఁడుపలుకగా లక్ష్మణుఁడు చెప్పుచున్నాఁడు ఓరామా! నీవే ప్రధానపురుషుఁడవు, నీవే సనాతన పురుషశ్రేష్ఠుఁడవు, నీకు తెలియనిదేమున్నది. అయినను నన్నడిగితివి గావున చెప్పెదను వినుము.

శ్లో॥ బకదాల్భ్యమునిశ్చాత్ర మహాశ్రమమధ్యగః।
అస్మాత్థ్సానాద్యోజనార్ధే మాశ్రమ స్తస్యరాఘవ॥

టీ॥ హేరాఘవా= ఓరాముఁడా, అత్ర = ఇచ్చట, బకదాల్భ్యమునిః=బకదాల్భ్యుఁడను ముని, మహదాశ్రమ మధ్యగః = గొప్ప ఆశ్రమమును పొందియుండెను. తస్య=ఆబకదాల్భ్యునియొక్క, ఆశ్రమః=ఆశ్రమము, అస్మాత్ = ఈ, స్థానాత్ = స్థానమునుండి, యోజనార్ధేం= రెండు క్రోసులు.

తా॥ ఓరాముఁడా! యిచ్చట బకదాల్భ్యుఁడను మహర్షియొక్క ఆశ్రమముగలదు. ఆయాశ్రమము నిచ్చటికి రెండు క్రోసులుండును.

శ్లో॥ అనేనదృష్టాబహవో బ్రహ్మాణోరఘునందన।
పరిపృచ్ఛత్వారాజేంద్ర పురాణంమునిపుంగవమ్॥

టీ॥ హేరఘునందనా= ఓరామా, అనేన= ఈ బకదాల్భ్యునిచేత, బహవః=అనేకమంది, బ్రహ్మాణః=బ్రహ్మలు, దృష్టాః = చూడఁబడిరి. తత్ = ఆహేతువుచేత, హేరాజేంద్రా=ఓరాజశ్రేష్ఠుఁడా, పురాణం= ప్రాచీనుఁడయిన, ఋషిపుంగవం = మునిశ్రేష్ఠుని, గత్వా = పొంది, పరిపృచ్ఛ= అడుగుము.

తా॥ ఓరామా! యీబకదాల్భ్యమునిచేత ననేక బ్రహ్మకల్పములు జూడఁబడినవి. కనుక అనేకరామావతారములనుకూడ చూచినవాఁడు. కనుక ప్రాచీనుడయిన యీమునిని నడుగుము.

శ్లో॥ ఇతివాక్యంతతశ్శ్రుత్వా లక్ష్మణస్యాఽతిశోభనం।
జగామరాఘవోద్రష్టుం బకదాల్భ్యంమహామునిమ్॥

టీ॥ తతః=అనంతరము, ఇతి=ఈప్రకారము, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, అతిశోభనం=మిక్కిలియోగ్యమయిన, వాక్యం=వాక్యమును, శ్రుత్వా= విని, రాఘవః=రాముఁడు, బకదాల్భ్యం=బకదాల్భ్యుఁడను, మహామునిం=మహర్షిని, ద్రష్టుం= చూచుటకు, జగామ=వెళ్లెను.

తా॥ అనంతర మీప్రకారము చెప్పఁబడిన లక్ష్మణుని మంచి మాటనుగ్రహించిఆబకదాల్భ్యునిచూచుటకాయాశ్రమమునకువెళ్లెను

శ్లో॥ ననామమునినాపృష్టః కుతోరామసమాగమః।
ఏవముక్తస్తుమునినా రామోవాక్యమథాబ్రవీత్॥

టీ॥ ననామ = నమస్కరించెను. హేరామా= రాముఁడా? కుతః= ఏహేతువుచేత, సమాగమః=రావడము, ఇతి= అని, మునినా= బకదాల్భ్యమహామునిచేత, పృష్టః=అడుగఁబడెను. మునినా=మునీశ్వరునిచేత, ఏవం=ఈప్రకారము, ఉక్తః=పలుకబడి, రామః=రాముఁడు, అథ=అనంతరము, వాక్యం= వాక్యమును, అబ్రవీత్= పలికెను.

తా॥ ఆశ్రమమునకువెళ్ళి బకదాల్భ్యునికినమస్కరించివానిచే నీవు ఎందుకై వచ్చినావని అడుగఁబడి ఆమునికి తిరుగనుత్తరమిచ్చెను.

శ్లో॥ త్వత్ప్రసాదాదహంవిప్ర తీరంనదనదీపతేః।
ఆగతోఽస్మిససైన్యోఽద్య లంకాంజేతుంసరాక్షసామ్॥

టీ॥ హేవిప్ర= ఓబకదాల్భ్యముని, అహం=నేను, త్వత్ప్రసాదాత్, త్వత్= నీయొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువల్ల, నదనదీపతేః= సముద్రునియొక్క, తీరం=వడ్డునుగూర్చి, అద్య=ఇప్పుడు, సరాక్షసాం= రాక్షసులతోకూడిన, లంకాం=లంకాపట్టణమును, జేతుం= జయించుటకు, ససైన్యః= సేనలతోకూడినవాడనై, ఆగతః= వచ్చినవాడిని, అస్మి= అయితిని.

తా॥ నేను నీయనుగ్రహమువల్ల రాక్షసులతోఁగూడ లంకాపట్టణమును జయించుటకు సేనలతోగూడ సముద్ర తీరమునకు వచ్చి యుంటిని.

శ్లో॥ భవత్ప్రసాదాదుదధిం తరిష్యామినచాన్యథా ।
తదుపాయంవదమునే ప్రసాదంకురుసువ్రత॥

టీ॥ హేమునీ= ఓబకదాల్భ్యముని, త్వత్ప్రసాదాత్, త్వత్= నీయొక్క ప్రసాదాత్ =అనుగ్రహమువలన, ఉదధిం=సముద్రమును,తరిష్యామి = దాటెదను. అన్యథా = నీయనుగ్రహము లేనియడల, నతరిష్యామి=దాటలేను. తత్ = ఆహేతువువల్ల, ఉపాయం = దాటునుపాయమును, వద=చెప్పుము, హేసువ్రత = ఓమంచివ్రతము గలవాఁడా! ప్రసాదం=అనుగ్రహమును, కురు= చేయుము.

తా॥ ఓ మంచిప్రవర్తనగల బకదాల్భ్యమునీ! నీయనుగ్రహమువల్ల సముద్రము దాటవలయునుగాని లేనియెడల దాటనలవి కాకున్నది. కనుక నాయందనుగ్రహించి దాటునుపాయము సెలవిమ్ము.

శ్లో॥ ఏతస్మాత్కారణాద్విప్ర త్వత్సమీపముపాగతః ।
ఇత్యుక్తోరామచంద్రేణ మునిఃప్రోవాచసాదరమ్॥

టీ॥ హేవిప్ర= ఓబకదాల్భ్యమునీ! ఏతస్మాత్ = ఈ, కారణాత్ = ఈకారమువల్ల, త్వత్సమీపం= నీసమీపమును, ఉపాగతః= వచ్చితిని, ఇతి=ఈలాగునని, రామచంద్రేణ= రామచంద్రునిచేత, ఉక్తః= పలుకబడినవాఁడై, మునిః= బకదాల్భ్యముని, సాదరం = ఆదరణ కలుగునట్లుగా, ప్రోవాచ= తిరిగి పలికెను.

తా॥ ఈహేతువువల్ల నీసమీపము చేరితినని రామునిచేవిన్నవింపఁబడినవాఁడై బకదాల్భ్యముని తిరిగి ప్రత్యుత్తరమాదరణతో పలికెను.

శ్లో॥ శృణురాఘవవక్ష్యామి సర్వదుఃఖవినాశనం ।
ఏకాగ్రమానసోభూత్వా వ్రతమేతత్సమాచర॥

టీ॥ హేరాఘవా= ఓరామా! సర్వదుఃఖవినాశనం, సర్వ=సమస్తమైన, దుఃఖ=దుఃఖములను, వినాశనం= నశింపచేయువ్రతమును, శృణు=వినుము, ఏకాగ్రమానసః, ఏకాగ్ర= నిశ్చలమైన, మానసః=మనస్సుగలవాడై, భూత్వా= ఉండి, ఏతత్ = ఈచెప్పబోవు, వ్రతం=వ్రతమును, సమాచర= చేయుము.

తా॥ ఓరామా ! సమస్త దుఃఖనాశకరమగు వ్రతము నొకదానిని చెప్పెద. స్థిరచిత్తముగలిగి చేయవలెను.

శ్లో॥ సత్యనారాయణోవిష్ణు ర్వాంఛితార్థఫలప్రదః ।
తస్యైవపూజనాద్రామ విజయస్థోభవిష్యసి॥

టీ॥ సత్యనారాయణః=సత్యనారాయణుడను,విష్ణుః= విష్ణుమూర్తి, వాంఛితార్థఫలప్రదః, వాంఛిత=కోరబడిన, అర్థ= కార్యములకు, ఫలప్రదః= ఫలమునిచ్చువాడు, హేరామ=ఓరాముడా! తస్యైవ = సత్యనారాయణునియొక్క, పూజనాత్ = పూజించుటవల్ల, విజయస్థః= విజయముగలవాఁడవు, భవిష్యసి= అయ్యెదవు.

తా॥ సత్యనారాయణరూపుఁడైన విష్ణుమూర్తి సమస్తకోర్కెలనిచ్చువాడు. ఆ దేవుని నీవు తప్పక పూజించిన జయముకలుగును.

శ్లో॥ నిస్సంశయం సముద్రంత్వం తరిష్యసిసవానరః ।
తద్వ్రతోక్తవిధానేన పూజయస్వసలక్ష్మణః॥

టీ॥ హేరామా=ఓరామా! త్వం=నీవు, సవానరః = వానరులతో కూడినవాఁడవై, సముద్రం=సముద్రమును, నిస్సంశయం= సంశయములేకుండ, తరిష్యసి= దాటగలవు. (అస్య = ఈ, వ్రతస్య= వ్రతమునకు, ఫలప్రదః=ఫలమునిచ్చు, విధిశ్చ=విధానమున్నూ, శ్రూయతాం= వినఁబడుగాక.) తత్ =ఆ, వ్రతోక్తవిధానేన = సత్యనారాయణవ్రతమందు చెప్పబడిన విధానముతో, సలక్ష్మణ=లక్ష్మణునితో, గూడినవాడవై, పూజయస్వ= పూజింపుము.

తా॥ నిశ్చయముగా నీవీ యగాధమయిన సముద్రము దాటగలవు. ఆ వ్రతమునకు చెప్పిన విధితో లక్ష్మణునితో కూడినవాడవయి పూజింపుము.

శ్లో॥ సంక్రాంతిదివసేప్రాప్తే కుంభమేకంతుకారయేత్ ।
హేమంవారాజతంవాపి తామ్రంవాపృథమృణ్మయమ్॥

టీ॥ సంక్రాంతిదివసే= సంక్రాంతిదినము, ప్రాప్తే=వచ్చినదగుచుండగా, హేమంవా=బంగారుదయినా, రాజతంవా=వెండిదయినా, తామ్రం

వా= రాగిదయినా, అథవా= లేక, మృణ్మయంవా=మట్టిదయినా,ఏకం= ఒక, కుంభం= కడవను, కారయేత్ = చేయించవలయును.

తా॥ సంక్రాంతి దినములయందు బంగారపుదయినా, లేక వెండిదయినా, లేక రాగిదయినా, లేక మట్టిదయినా ఒక కలశమును చేయించవలెను.

శ్లో॥ స్థాపయేద్ద్యోతితంకుంభం జలపూర్ణంసపల్లవం ।
తస్యోపరిన్యసేద్దేవం హైమంనారాయణంప్రభుమ్॥

టీ॥ ద్యోతితం= ప్రకాశించుచున్న, కుంభం=కలశమును, జలపూర్ణం= ఉదకముతో నిండినదాన్నిగా, సపల్లవం = చిగురుటాకులతో కూడినదాన్నిగాను, స్థాపయేత్ = స్థాపించవలయును. తస్య= ఆకలశముయొక్క, ఉపరి=పయిభాగమందు, ప్రభుం = సమర్థుడయినట్టిన్ని, నారాయణం= నారాయణుడను, హైమం = బంగారు రూపమయిన, దేవం= దేవతాప్రతిమను, న్యసేత్ = ఉంచవలయును.

తా॥ ప్రకాశించుచున్న యాకలశమును జలపల్లవములతో గూడ స్థాపించి ఆకలశముమీద సమర్థుడయిన సత్యనారాయణదేవుని బంగారుప్రతిమను నుంచవలయును.

శ్లో॥ సాయంకాలేశుచిర్భూత్వా నద్యాంస్నానంసమాచరేత్ ।
నిశ్చలంస్థాపయేత్కుంభం గంధమాల్యానులేపనైః॥

టీ॥ సాయంకాలే= సాయంకాలమందు, శుచిః= పరిశుద్ధుడై, భూత్వా= ఉండి, నద్యాం= నదియందు, స్నానం= స్నానమును, సమాచరేత్ = చేయవలయును. గంధ= గంధముయొక్క,మాల్యా= మాలికలయొక్క, అనులేపనైః= ధారణలచేత, నిశ్చలం = మనస్సుచలించకుండా, కుంభం= కలశమును, స్థాపయేత్ = ఉంచవలెను.

తా॥ సాయంకాలమందు పరిశుద్ధుడై నదియందు స్నానము చేసి గంధముచేతను, పుష్పమాలికలచేతను నలంకరించి నిశ్చలమైన మనస్సుతో సత్యదేవుని పూజించవలెను.

శ్లో॥ దాడిమైర్నారికేళైశ్చ పూరయేచ్చవిశేషతః ।
నవధాన్యైరథ స్తస్య మంటపంకారయేద్బుధః॥

టీ॥ దాడిమైః=దాడిమ ఫలములచేతను, నారికేళైశ్చ = కొబ్బరికాయచేతను, విశేషతః=విశేషముగా, పూరయేత్ = నింపించవలయును. (అనఁగా కొబ్బరిఫలములచే నలంకరించవలయుననుట)తస్య=ఆకలశముయొక్క, అధః=క్రిందిప్రదేశమందు, నవధాన్యైః= నవధాన్యములచే, మంటపం= మంటపమును, బుధః = తెలిసినవాడు, కారయేత్ = చేయించవలయును.

తా॥ ఆకలశమును దాడిమఫలములచేతను. కొబ్బరికాయచేతను నలంకరించి ఆకలశముయొక్క క్రిందిభాగమునందు నవధాన్యములచేత మంటపమును నిర్మించవలయును.

శ్లో॥ వస్త్రయుగ్మేనసంవేష్ట్య నవరత్నైశ్చశోభితే।
తస్మిన్కుంభేన్యసేద్దేవం ప్రతిష్ఠాంచసమాచర॥

టీ॥ నవరత్నైః= నవరత్నములచేత, శోభితే= ప్రకాశింపఁజేయఁబడిన, తస్మిన్=ఆ, కుంభే=కలశమునందు, వస్త్రయుగ్మేన = వస్త్రద్వయముచేత, సంవేష్ట్య= చుట్టి, దేవం=సత్యదేవుని, న్యసేత్ = ఉంచవలయును, ప్రతిష్ఠాంచ=ప్రాణప్రతిష్ఠనున్ను, సమాచర=చేయుము.

తా॥ నవరత్నములతోకూడిన ఆకలశమునందు రెండు వస్త్రములనుచుట్టి సత్యదేవుని ప్రతిమనుంచి ప్రాణప్రతిష్ఠనుచేయవలయును.

శ్లో॥ గంధైర్ధూపైశ్చదీపైశ్చ నైవేద్యైర్వివిధైస్తథా।
పూజయిత్వాకథాంశ్రుత్వా వాంఛితం ఫలమాప్నుయాత్॥

టీ॥ గంధైః = గంధముచేతను, ధూపైశ్చ = ధూపముచేతను, దీపైః= దీపములచేతను, వివిధైః = నానావిధములయిన, నైవేద్యైః= నివేదనలచేతను, తథా = ఆప్రకారము, పూజయిత్వా = పూజించి, కథాం= వ్రతకథను, శ్రుత్వా=విని, వాంఛితం = కోఱిన, ఫలం = ఫలమును, ఆప్నుయాత్ = పొందవలయును.

తా॥ ఆదేవుని గంధధూపదీపనైవేద్యములచే పూజించి సత్యవ్రతకథను వినినయెడల కోఱిన కోఱికలను బొందును.

శ్లో॥ రాత్రిజాగరణంకృత్వా నృత్యగీతాదికారయేత్।
ప్రాతరుత్థాయమేధావి మార్తాండస్యోదయేసతి॥

టీ॥ రాత్రౌ=రాత్రియందు, జాగరణం=మేలుకొనుటను, కృత్వా= చేసి, నృత్యగీతాది= నాట్యము, గానము మొదలయినవి, కారయేత్ = చేయించవలెను. మేధావీ= బుద్ధిమంతుఁడు, ప్రాతః= ప్రాతఃకాలమందు, ఉద్ధాయ=లేచి, మార్తాండస్య= సూర్యుఁడు, ఉదయేసతి= ఉదయించుచుండగా,

తా॥ రాత్రియందు మేలుకొని నృత్యము గానము మొదలైన వానిచే కాలము గడుపవలయును. ప్రాతఃకాలమందు లేచి సూర్యుఁడుదయించుచుండగా—

శ్లో॥ గంధపుష్పాక్షతైస్సమ్య క్పూజయిత్వాయథావిధి।
ప్రతిమాంస్వర్ణకుంభంచ ప్రదద్యాద్బ్రాహ్మణాయచ॥

టీ॥ గంధపుష్పాక్షతైః, గంధ=గంధముచేతను, పుష్ప= పుష్పములచేతను, అక్షతైః= అక్షతలచేతను, యథావిధి= విధి నతిక్రమించకుండా, సమ్యక్= యోగ్యముగా, పూజయిత్వా=పూజించి, ప్రతిమాం= సత్యదేవుని ప్రతిమనున్ను, స్వర్ణకుంభంచ= బంగారుకలశమునున్ను, బ్రాహ్మణాయ= బ్రాహ్మణునికొఱకు, ప్రదద్యాత్ = ఇవ్వవలయును.

తా॥ గంధపుష్పాక్షతలచేత యథావిధిగా పూజించి, సత్యనారాయణ ప్రతిమనున్నూ, బంగారు కలశనున్నూ బ్రాహ్మణునికివ్వవలెను.

శ్లో॥ కుంభేనసహరాజేంద్ర మహాదానానిదాపయేత్ ।
అనేనవిధినారామ పూజయస్వసలక్ష్మణః॥

టీ॥ హేరాజేంద్ర = ఓరాజశ్రేష్ఠుఁడయినరామా! కుంభేన సహ= కలశముతోకూడా, మహాదానాని = షోడశమహాదానములను, దాపయేత్= యిప్పించవలయును. హేరామా= ఓరాముఁడా, సలక్ష్మణః= లక్ష్మణునితోగూడి, అనేన=ఈ, విధినా= విధానముచేత, పూజయస్వ= పూజించుము.

తా॥ ఓరాజశ్రేష్ఠుఁడవయిన రామా! తర్వాత కలశముతో కూడా షోడశమహాదానములను జేయించవలయును. ఈచెప్పిన విధిగా లక్ష్మణునితోగూడ సత్యదేవుని పూజించుము.

శ్లో॥ కురువ్రతం ప్రయత్నేన విజయస్థో భవిష్యసి।
ఇతిశ్రుత్వా తతో రామః యథోక్తమకరోత్తదా॥

టీ॥ ప్రయత్నేన=ప్రయత్నముచేత, వ్రతం=సత్యవ్రతమును, కురు=చేయుము, విజయస్థః= విజయముగలవాడవు, భవిష్యసి = కాగలవు, ఇతి=యీలాగున, రామః=రాముఁడు, శ్రుత్వా=విని, యథోక్తం=చెప్పినట్టుగా, తదా=అప్పుడు, అకరోత్ = చేసెను.

తా॥ ఓ రామా! నీకు జయము కలుగును. ఈవ్రతమునుతప్పక చేయుమని బకదాల్భ్యుఁడు చెప్పిన విధిని విని తర్వాత నామునిచెప్పిన రీతిగా వ్రతమును అప్పుడే చేసెను.

శ్లో॥ కృతేవ్రతే తేనవిజయః బభూవరఘునందనః।
ప్రాప్తాసీతా జితాలంకా పౌలస్త్యోనిహతోరణే॥

టీ॥ రఘునందనః= రాముఁడు, వ్రతే=వ్రతము, కృతే=చేయఁబడినదగుచుండగా, సవిజయః = జయముగలవాడై, బభూవ = ఉండెను, లంకా=లంకాపట్టణము, ప్రాప్తా = పొందబడినది, రణే= యుద్ధమందు, పౌలస్త్యః= పులస్త్యబ్రహ్మపుత్రుడయిన రావణుఁడు, నిహతః=చంపఁబడెను. సీతా= భార్యయయిన సీతాదేవి, ప్రాప్తా= పొందబడినది.

తా॥ ఆబకదాల్భ్యుఁడు చెప్పినరీతిగా రాముఁడు వ్రతమును జేసి జయముగలవాడాయెను. అది యేదనఁగా, రావణుని జయించి లంకాపట్టణమందు సీతాదేవిని బొందెను.

శ్లో॥ అనేనవిధినాప్రాయే కుర్వంతివ్రతోత్తమం।
పఠనాచ్ఛ్రవణాచ్చైవ విజయంప్రాప్నుయుర్ధ్రువమ్॥

టీ॥ హేవిప్రాః= ఓ శౌనకాదిమునులారా, అనేన=ఈ, విధినా=విధానముగా, వ్రతోత్తమం=వ్రతశ్రేష్ఠమయిన సత్యవ్రతమును, యే=ఎవరు, కుర్వంతి= చేయుచున్నారో వారున్నూ। పఠనాత్ = పఠించుటవల్లనున్నూ, శ్రవణాచ్చైవ= వినుటవల్లనున్నూ, ధ్రువం = నిశ్చయముగా, విజయం=జయమును, ప్రాప్నుయుః= పొందెదరు.

తా॥ ఈప్రకారమిూసత్యనారాయణవ్రతము సేవనుచేయుదురో విందురో, పఠించెదరో వారునిశ్చయముగా జయమును బొందగలరు,

ఇతి షష్ఠోఽధ్యాయ స్సమాప్తః,

---

అథ సప్తమోఽధ్యాయ ప్రారంభః.

శ్లో॥ శ్రుణుధ్వంమునయస్సర్వే పునర్యేనకృతంభువి।
ద్వాపరస్యయుగస్యాదౌ పురామాహిష్మతీపురీ॥

టీ॥ హేమునయః= ఓశౌనకాదిమునులారా, భువి=భూలోకమందు పునః= తిరిగి, యేన=ఎవనిచే, కృతం=చేయఁబడినదో, సర్వే = సమస్తమయినవారు, శ్రుణుధ్వం=వినండి, పురా = పూర్వకాలమందు, ద్వాపరస్య= ద్వాపరమను,యుగస్య=యుగముయొక్క,ఆదౌ= మొదటిభాగమందు,మాహిష్మతీ= మాహిష్మతీయను, పురీ=పట్టణము, అస్తి=కలదు.

తా॥ ఓశౌనకాది మునులారా! తిరిగి భూలోకమందెవనిచే చేయఁబడినదో దానిని మీరందఱు వినవలెను, పూర్వకాలంబున ద్వాపరయుగము ప్రారంభ మగుచుండగా మాహిష్మతియను నొక పట్టణము గలదు.

శ్లో॥ తస్యాంమహీజితోరాజా ఖ్యాతంరాజ్యంచకారహ।
తతోఽస్యవసతఃప్రాప్తః కాలోబహుతరోగతః॥

టీ॥ తస్యాం=ఆపట్టణమందు, సః=ప్రసిద్ధుఁడైన, మహీజితః= మహీజిత్తుఁడను, రాజా=రాజు, ఖ్యాతం= ప్రసిద్ధికలుగునట్టుగా, రాజ్యం= రాజ్యమును, చకార= చేసెను, తతః = తర్వాత, వసతః = ఆప్రకారము రాజ్యముచేయుచున్న, అస్య= ఈరాజునకు, బహుతరః= విస్తారమయిన, ప్రాప్తః = పూర్వజన్మమువలన పొందబడిన, కాలః = ఆయుఃకాలము, గతః= వెళ్ళినది.

తా॥ ఆపట్టణమందు మహీజిత్తను ప్రసిద్ధిగలరాజు ప్రసిద్ధిగ రాజ్యముచేయుచుండెను. అట్లు రాజ్యము చేయుచుండగా తనదీర్ఘమయిన పూర్వజన్మార్జితమయిన ఆయుర్దాయముచాలవఱకుగడచినది,

శ్లో॥ దృష్ట్వాత్మానంప్రవయసం రాజాచింతాకులోఽభవత్
జనాన్ప్రాహసభామధ్యే విషణ్ణవదనోవచః॥

టీ॥ రాజా= రాజు, ఆత్మానం= దేహమును, ప్రవయసం= పెద్దవయస్సుగలదానినిగా, దృష్ట్వా= తెలిసికొని, చింతాకులః=విచారముచే చలచిత్తుడై, అభవత్= ఉండెను. విషణ్ణవదనః, విషణ్ణ= దుఃఖముగలవాడై, సభామధ్యే = సభామధ్యమందు, జనాన్ = జనులను గూర్చి, ప్రాహ= పలికెను.

తా॥ రాజు తన దేహమును జీర్ణమయిన దానిగ తెలిసికొని దుఃఖముగలవాఁడై, వాడిన ముఖముగలవాఁడై, సభామధ్యమందు జనులనుగూర్చి యొక వాక్యమును బలికెను.

శ్లో॥ ఇహజన్మనిభోలోకా నమయాపాతకంకృతం।
అన్యాయోపార్జితంవిత్తం విత్తకోశేమమాద్యన॥

టీ॥ భోలోకాః= ఓజనులారా, ఇహ=ఈ, జన్మని = జన్మయందు, మయా= నాచే, పాతకం=పాపమును, నకృతం= చేయబడలేదు, అద్య= యిప్పుడు, మమ=నాయొక్క, విత్తకోశే= ధనపుకొట్టునందు, అన్యాయోపార్జితం=న్యాయములేకుండసంపాదించిన, విత్తం=ధనము,న=లేదు.

తా॥ ఓజనులారా! ఈజన్మమందు నేనేమియు పాపముచేసియుండలేదు. అన్యాయముగా సంపాదించిన ధనమయినా ధనాగారమందు నిలవచేసియుండలేదు.

శ్లో॥ బ్రాహ్మణస్యక్వచిద్ద్రవ్యం నగృహీతంమయాబలాత్ ।
దుష్టేషుపాతితోదండో నాదండ్యేషుకదాచన॥

టీ॥ మయా=నాచే, బ్రాహ్మణస్య=బ్రాహ్మణునియొక్క, ద్రవ్యం=ద్రవ్యము, బలాత్ =యిష్టములేకుండ, నగృహీతం = తీసికొనబడలేదు. దుష్టేషు= దుర్మార్గులయందు, దండః=శిక్ష, పాతితః= ప్రయోగించబడినది. కదాచన= ఒకప్పుడు, అదండ్యేషు= శిక్షకు తగనివారలయందు, నపాతితః= ప్రయోగించబడుటలేదు.

తా॥ ఆపాపము లేకుండుటచే వివరించుచున్నాడు. (నవిషం విషమిత్యాహుర్బ్రహ్మస్వంవిషముచ్యతే) యను న్యాయముచేత బ్రా

హ్మణుల ద్రవ్యము విధిచోదితమయిన షడ్భాగాదికముతప్ప యితర ముగా నెప్పుడు గ్రహించబడలేదు. దుష్టశిక్షణ శిష్టరక్షణ యను రాజధర్మముచే దుష్టులే శిక్షించబడిరి. గాని సత్పురుషుల నెప్పుడు శిక్షించినవాడనుగాను.

శ్లో॥ ఇత్యేవంవ్రజతోమార్గే ధర్మయుక్తేద్విజోత్తమాః।
కస్మాన్మమగృహేపుత్రో నజాతస్తద్విమృగ్యతామ్॥

టీ॥ హేద్విజోత్తమాః= ఓబ్రాహ్మణశ్రేష్ఠులారా, ఇత్యేవం= ఈ ప్రకారము, ధర్మయుక్తే= అధర్మములేని, మార్గే= మార్గమందు, వ్రజతః=ప్రవర్తించుచున్న, మమ = నాయొక్క, గృహే = ఇంటియందు, కస్మాత్ = యే హేతువువల్ల, పుత్రః=కుమారుఁడు, నజాతః = పుట్టినవాడుకాడో, తత్ =ఆ హేతువు, మృగ్యతాం= వెతుకబడుగాత.

తా॥ ఓబ్రాహ్మణశ్రేష్ఠులారా! యీప్రకారము ధర్మమార్గమందు నడుచుచున్న నాకు, పుత్రుఁడు కలుగకుండుటకు కారణమును విచారించుడని రాజు సభయందు పలికెను.

శ్లో॥ ఇతిరాజ్ఞోవచశ్శ్రుత్వా సప్రజాస్సపురోహితాః।
మంత్రయిత్వానృపహితం జగ్మశ్చవిజనంవనమ్॥

టీ॥ ఇతి= యీప్రకారము, రాజ్ఞః= రాజుయొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా=విని, సప్రజాః=సంతానములతో కూడినట్టిన్ని, సపురోహితాః= పురోహితులతోకూడినట్టిన్ని, జనాః=జనులు, నృపహితం, నృప=రాజుకు, హితం=హితవును, (హితవనఁగా చెప్పునప్పుడు కష్టముగానుండి అంత్యమునకు ఫలమునిచ్చునది) మంత్రయిత్వా=ఆలోచించి, విజనం= జనరహితమయిన, వనం= వనమునుగూర్చి, జగ్మః = వెళ్లిరి.

తా॥ ఈప్రకారము పలికిన రాజు పలుకులువిని సభాజనులు పుత్రమిత్రపురోహితులతోగూడి రాజుకు శ్రేయస్సు యెట్లు కలుగునని యాలోచించి జనరహితమయిన యరణ్యమునకు వెళ్లిరి.

శ్లో॥ నృపతేర్హితమిచ్ఛంతో దదృశుర్మునిసత్తమం।
నిరాహారంజితాత్మానం జితక్రోధంసనాతనం॥

లోమశంధర్మతత్వజ్ఞం సర్వశాస్త్రవిశారదం।
దీర్ఘాయుషంమహాత్మాన మనేకబ్రహ్మసంయుతమ్॥

టీ॥ నృపతేః=రాజును, హితం= హితమును, ఇచ్ఛంతః=కోరువారై, నిరాహారం= ఆహారములేనట్టిన్ని, జితాత్మానం, జిత=జయించబడిన, ఆత్మానం= ఇంద్రియములు గలిగినట్టిన్ని, జిత = జయించబడిన, క్రోధం= కోపముగలిగినట్టిన్ని, సనాతనం = ప్రాచీనుఁడయినట్టిన్ని, ధర్మ తత్వజ్ఞం= ధర్మయథార్థమును తెలిసినట్టిన్ని, సర్వ= సమస్తమయిన, శాస్త్ర=శాస్త్రములయందు, విశారదం= నేర్పుకలిగినట్టిన్ని, దీర్ఘాయుషం= విస్తారమయిన నాయుర్దాయముగలిగినట్టిన్ని, అనేక = అనేకు లయిన, బ్రహ్మ=బ్రహ్మలతో, సంయుతం = కూడినట్టిన్ని, (అనఁగా అనేక బ్రహ్మకల్పములు గడచినవాఁడనుట) మహాత్మానం = మహాత్ముఁడైన, లోమశం= లోమశుఁడను, మునిసత్తమం = మునిశ్రేష్ఠుని, దదృశుః= చూచిరి.

తా॥ ఆజనులు వనమునకువెళ్లి రాజక్షేమమును కోఱినవారు గనుక దానికి తగినట్టుగా ఆహారము లేనివాఁడును, ధర్మములను శాస్త్రములను దెలిసినవాఁడును, జితేంద్రియుఁడును, ననేకబ్రహ్మకల్పములుచూచిన వాఁడునైన లోమశుఁడను నొక మహామహిమగల మునిశ్రేష్ఠుని జూచిరి.

శ్లో॥ కల్పేకల్పేగతేతస్య చైకరోమగతోఽభవత్।
తస్మాల్లోమశనామాఽసౌ త్రికాలజ్ఞోమహామునిః॥

టీ॥ కల్పేకల్పే= ప్రతికల్పము, గతే= వెళ్ళినదవుచుండగా, తస్య= ఆమహామునికి, ఏకరోమ= ఒకరోమమే సంవత్సరమే, గతః=పోయినది, అభవత్=ఆయెను, అతః= ఆహేతువువల్ల, అసౌ= ఈమహాముని,లోమశనామా= లోమశుడనుపేరుగల, త్రికాలజ్ఞం = భూతభవిష్యద్వర్తమానములను గుర్తెఱిగిన, మహామునిం= మహామునియయిన—

తా॥ ఆ మహామహామునకు నొక బ్రహ్మకల్పము వెళ్ళినట్టుగా నొకరోమము నశించుచుండును. అట్లు నశించుటచే త్రికాలమును గుర్తెఱిగిన యీమహాముని లోమశుడను పేరుగలవాఁడాయెను.

శ్లో॥ తం దృష్ట్వా హర్షితాస్సర్వే జగ్ముస్తస్య చసన్నిధిం।
గత్వా గత్వా నమః కృత్వా యథార్హం వివిశుశ్చతే॥

టీ॥ తం= ఆమహాముని, దృష్ట్వా=చూచి, సర్వే= సమస్తజనులు, హర్షితాః= సంతోషముగలవారై, తస్య= ఆలోమశునియొక్క, సన్నిధిం= సామీప్యమును, జగ్ముః=పొందిరి. గత్వా=వెళ్ళి, తతః=తర్వాత, నమః=నమస్కారమును. కృత్వా= చేసి, తే=వారు, యథార్హం= తగినట్టుగా, వివిశుః= కూర్చుండిరి.

తా॥ ఆప్రజలు లోమశునిజూచి సంతోషముగలవారై దగ్గఱ చేరి పిదప నమస్కరించి వారివారికి తగిన యాసనముల నలంకరించి యుండిరి.

శ్లో॥ వినయావనతాస్సర్వే ఊచుశ్చైవం పరస్పరం।
రాజ్ఞో భాగ్యవశాదేవ ప్రాప్తోఽయం మునిసత్తమః॥

టీ॥ సర్వే= వారందరు, వినయావనతాః, వినయ= వినయముచేత, అవనతాః= నమ్రులై, పరస్పరం=అన్యోన్యము, ఏవం= ఈప్రకారము, ఊచుః= పలికిరి, అయం= ఈ, మునిసత్తమః=మునిశ్రేష్ఠుడు, రాజ్ఞః= రాజుయొక్క, భాగ్యవశాదేవ = అదృష్టమువల్లనుండి, ప్రాప్తః= లభించినాడు, అని.

తా॥ వారందరారీతిగా నాసనముల నలంకరించి వినయయుక్తులై తమలో తాము మనప్రభువుయొక్క అదృష్టమువల్ల నిట్టి మహాత్ముడయిన ముని మనకు లభించినాడని సంభాషించుకొనిరి.

లోమశః॥ శ్లో॥ కిమర్థమిహ సంప్రాప్తాః కథయధ్వం తు కారణం।
మమదర్శనసంహ్లాదాన్మాం స్తువంతో భృశం నుకిమ్॥

టీ॥ కిమర్థం=ఎందుచే, ఇహ=ఇచ్చటకు, సంప్రాప్తాః=వచ్చినవారు, కారణం= కారణమును, కథయధ్వం= చెప్పుడు, మమ = నాయొక్క, దర్శనసంహ్లాదాత్, దర్శన=చూచుటచేతనయిన, సంహ్లాదాత్=సంతోషమువల్ల, మాం=నన్ను, భృశం=మిక్కిలి, కిం నను=ఎందుకై, స్తువంతః= స్తోత్రముచేయుచున్నారు.

తా॥ లోమశుడు వచించుచున్నాడు, మీరెందుకై యిచ్చ

టకు విచ్చేసినారో చెప్పుడు. నన్ను చూచి మిక్కిలి సంతోషముతో స్తోత్రము చేయుచున్నారెందువల్ల.

శ్లో॥ అసంశయంకరిష్యామి భవతాంయన్మనోగతం।
పరోపకృతయేజన్మ మాదృశానాంనసంశయః॥

టీ॥ భవతాం= మీయొక్క, మనోగతం= మనస్సును పొందినది, యత్= యేదో, తత్=దానిని, అసంశయం= సంశయములేకుండా, కరిష్యామి= చేసెదను. మాదృశానాం = మావంటివారియొక్క, జన్మ= పుట్టుక, పరోపకృతయే= పరోపకారముకొఱకు, భవతి= అగుచున్నది. నసంశయః= సంశయములేదు.

తా॥ సంశయములేక మీమనస్సునందున్న కోటికల నెఱవేర్చెద. మావంటి పురుషుల జన్మపరుల కుపకారముచేయుటే ముఖ్యమయిన ప్రయోజనము గాగలదిగదాయనెను.

జనాః॥ శ్లో॥ శ్రూయతామభిధాస్యామో యదర్థమిహచాగతాః।
సంశయచ్ఛేదనార్థాయ తవసన్నిధిమాగతాః॥

టీ॥ వయం=మేము, యదర్థం=యెందుకై, ఇహ=యిచ్చటకు. ఆగతాః= వచ్చినామో, అభిధాస్యామః=చెప్పెదము. శ్రూయతాం= వినబడుగాత. సంశయ=సంశయముయొక్క, ఛేదనార్థాయ= పోగొట్టునిమిత్తము, తవ=నీయొక్క, సన్నిధిం=సమీపమును, ఆగతాః=పొందినాము.

తా॥ ఓ లోమశమహామునీ! మేము మీయొద్దకు వచ్చినపనిని జెప్పెదము. కొంత సంశయముగలవారమయి మీవంటివారివల్ల ఆసంశయము తీరునను కోరికతో మీసాన్నిధ్యము చేరినాము.

శ్లో॥ పద్మయోనేఃపరతరః త్వత్తః శ్రేష్ఠోనవిద్యతే।
అతఃకార్యవశాత్ప్రాప్తాః స్సమీపంభవతోవయమ్॥

టీ॥ పద్మయోనేః=బ్రహ్మకంటె, పరతరః= పరమైనవాడవు, త్వత్తః= నీకంటె, శ్రేష్ఠః=గొప్పవాడు, నవిద్యతే=లేడు. అతః= ఆహేతువువల్ల, వయం=మేము, భవతః= మీయొక్క, సమీపం=సామీప్యమును, కార్యవశాత్= కార్యవశమువల్ల, ప్రాప్తాః= వచ్చినాము.

తా॥ నీవు బ్రహ్మకన్న ప్రాచీనుడవు. నీకన్న ప్రాచీనులు

యోగ్యులు నీలోకమందు లేరు. కావున నొక కార్యావసరముచే మీ సాన్నిధ్యము చేరుట కలిగినది.

శ్లో॥ మహీజిన్నామరాజాఽస్తి పుత్రహీనస్తుసాంప్రతం।
వయంతస్యప్రజాబ్రహ్మన్ పుత్రవత్తేనపాలితాః॥

టీ॥ మహీజిన్నామ= మహీజిత్తను ప్రసిద్ధిగల, రాజా=రాజు, అస్తి= కలడు. సాంప్రతం=ఇప్పుడు, పుత్రహీనః=పుత్రులులేనివాడు, వయం= మేము, తస్య=అతనియొక్క, ప్రజాః=ప్రజలము, హేబ్రహ్మన్= ఓలోమశుడా, తేన=అతనిచే, పుత్రవత్= కుమారులవలె, పాలితాః= రక్షింపబడినాము.

తా॥ ఆకార్యమేమనిన మహీజిత్తను నొకరాజు పుత్రులులేనివాడై "అపుత్రస్య గతిర్నాస్తి" యను వాక్యమునను సరించి పుత్రులులేనందున పుమను నరకమును దాటించువారు లేరుగదా యని దుఃఖసముద్రమందు మునిగియున్నవాడు. మేము వానిచే పుత్రప్రేమచే పరిపాలించబడిన వాని రాజ్యమందుండు జనులము.

శ్లో॥ తంపుత్రరహితందృష్ట్వా తస్యదుఃఖేనదుఃఖితాః।
తపఃకర్తుమిహాయాతా మతింకృత్వాతునైష్ఠికీమ్॥

టీ॥ తం= ఆరాజును, పుత్రరహితం= కుమాళ్లులేనివానిగ, దృష్ట్వా= చూచి, తస్య=రాజుయొక్క, దుఃఖేన=దుఃఖముచేత, దుఃఖితాః=దుఃఖముగలవారమై, నైష్ఠికీం=నిష్ఠగల, మతిం= బుద్ధిని, (అనగా స్థిరబుద్ధి ననుట) కృత్వా=చేసి, తపః= తపస్సును, కర్తుం=చేయుటకు, ఇహ= ఇచ్చటకు, ఆయాతాః= వచ్చితిమి.

తా॥ మేమట్లు పుత్రదుఃఖముగల రాజునుజూచి రాజుయొక్క సత్యపరిపాలనచే ననురక్తులమయి యతనిదుఃఖము మాదుఃఖముగా తలచుకొని కృతజ్ఞతను జూపుటకై మేముతపస్సుచేసి రాజునకుపుత్రసంతతిని కలుగజేయుదుమను స్థిరమయిన తలంపుతో నీవనముచేరితిమి.

శ్లో॥ తస్యభాగ్యవశాద్దృష్టో హ్యస్మాభిస్త్వంద్విజోత్తమ।
మహాతాందర్శనేనైవ కార్యసిద్ధిర్భవేన్నృణామ్॥

టీ॥ హేద్విజోత్తమ= ఓలోమశుడా! అస్మాభిః=మాచేత, త్వం=

నీవు, తస్య=అతనియొక్క, భాగ్యవశాత్ = అదృష్టవశమువల్ల, దృష్టః= చూడబడినవాడవు, నృణాం= నరులకు, మహాత్మాం= మహాత్ములయొక్క, దర్శనేనైవ= దర్శనముచేతనే, కార్య=కార్యముయొక్క, సిద్ధిః= లాభము, భవేత్ = అవును.

తా॥ మా రాజుయొక్క పూర్వార్జిత పుణ్యముచే ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! నీవు చూడబడితివిగదా. ఇట్టి మహామహుల దర్శనము కార్యమును తప్పక నొనగూర్చుట లోకవిదితమేగదా.

శ్లో॥ ఉపదేశంవదమునే రాజ్ఞఃపుత్రోయథాభవేత్।
ఇతితేషాంవచశ్శ్రుత్వా ముహూర్తంధ్యానమాస్థితః॥

టీ॥ హేమునే= ఓ లోమశమునీ! రాజ్ఞః= రాజునకు, పుత్రః= కుమారుఁడు, యథా= యేప్రకారముగ, భవేత్ = కలుగునో, తథా= అట్టిగ, ఉపదేశం= ఉపదేశమును, వద=చెప్పుము, ఇతి=ఈప్రకారముగ,తేషాం= ఆప్రజలయొక్క, వచః= వాక్యమును, శ్రుత్వా=విని, ముహూర్తం= క్షణకాలము, ధ్యానం=ధ్యానమును, ఆస్థితః= పొందినవాఁడై.

తా॥ కావున ఓ మహానుభావా! మా రాజునకెట్లు సంతానము కలుగునో యటువంటి యొకానొక యుపదేశము చేసినయెడల మేము దానిననుష్ఠించి రాజునకు కృతజ్ఞతను చూపెదమని పలికిన ప్రజలపలుకులాలకించి కొంతతడవు ధ్యానము చేసెను.

శ్లో॥ ప్రత్యువాచమునిర్జ్ఞాత్వా తస్యజన్మపురాతనమ్॥

టీ॥ మునిః= లోమశమహాముని, తస్య = రాజుయొక్క, పురాతనం= ఇదివఱలోజరిగిన, జన్మ= పుటకను, జ్ఞాత్వా= తెలిసికొని, ప్రత్యువాచ= ప్రత్యుత్తరమిచ్చెను.

తా॥ అట్లు ముని కొంతకాలము ధ్యానించి ఆరాజుయొక్క పూర్వజన్మవృత్తాంతము తెలిసికొని తిరుగ నుత్తరమిచ్చెను.

లోమశః॥ శ్లో॥ పూర్వజన్మనివైశ్యోఽయం ధనహీనోనృశంసకః॥
వాణిజ్యకర్మనిరతో గ్రామాద్గ్రామాంతరంభ్రమన్॥

టీ॥ అయం= ఈరాజు, పూర్వజన్మని=పూర్వజన్మమందు, ధనహీనః=ధనములేని, నృశంసకః=ఘాతకుఁడైన, వైశ్యః=కోమటియై,వాణిజ్య

కర్మే = వ్యాపారమునందు, నిరతః= ఆసక్తికలిగి, గ్రామాత్ = గ్రామమునుండి, గ్రామాంతరం=మఱియొకగ్రామమును, భ్రమన్= తిరుగుచు,

తా॥ ఓ జనులారా! ఈ రాజు వెనుకటి జన్మమందు దుర్వృత్తి గల దరిద్రుడయిన యొక వర్తకుడు, వర్తకమందతి నేర్పుగలవాడై యొక గ్రామమునుంచి మఱియొకగ్రామము తిరుగువాడై,

శ్లో॥ జ్యేష్ఠమాసేసితేపక్షే ద్వాదశ్యాందివసేతదా।
మధ్యస్థేచదివానాథే గ్రామాభ్యాసేజలాశయే॥

టీ॥ తదా= ఆతిరుగుకాలమందు, జ్యేష్ఠమాసే= జ్యేష్ఠమాసమందు, సితే=శుక్లమయిన, పక్షే=పక్షమందు, ద్వాదశ్యాం = ద్వాదశియందు, దివసే= దినమందు, దివానాథే=సూర్యుడు, మధ్యస్థే=మధ్యనున్నవాడవుచుండగా, (అనగా మధ్యాహ్నమందనుట) గ్రామాభ్యాసే= గ్రామసమీపమందు, జలాశయె=మడుగునందు.

తా॥ జ్యేష్ఠమాస శుక్లపక్ష ద్వాదశిరోజు మధ్యాహ్నము ఒకానొక గ్రామసమీపమందొకానొక సరస్సమీపమునకు చేరినవాడై యుండగా.

శ్లో॥ అకృత్రిమజలందృష్ట్వా జలపానమనోరథా।
సద్యఃప్రసూతాసవత్సా ధేనుస్తత్రసమాగతా॥

టీ॥ అకృత్రిమజలందృష్ట్వా, అకృత్రిమ= స్వతస్సిద్ధమయిన, జలం= ఉదకమును, దృష్ట్వా=చూచి, (అనగా నదీజలమును చూచి యనుట) జలపానమనోరథా, జలపాన= ఉదకపానమందు, మనోరథా = కోరికకలదై, సద్యః= అప్పుడు, ప్రసూతా= ప్రసవించిన, ధేనుః=ఆవు, సహవత్సా= దూడతోకూడి, తత్ర= ఆమడుగునకు, సమాగతా=వచ్చెను.

తా॥ ఆమడుగు సమీపమునకు అప్పుడే ప్రసవించినదై దూడతో కూడినదై స్వచ్ఛమయిన యామడుగునందుండుజలముజూచి దప్పికొని త్రాగునిచ్ఛగలదై యా సరస్సమీపమునకుం జేరెను.

శ్లో॥ తృష్ణాతురాంనిదాఘార్తాం తస్మిన్పాతుంజలంగతాం।
పిబంతీంవారయిత్వాఽసౌ పశ్చాత్తోయంపపౌవణిక్॥

టీ॥ తృష్ణాతురాం= దప్పిక కలిగినట్టిన్ని, నిదాఘార్తాం=యెండచే డస్సినట్టిన్ని, తస్మిన్= ఆమడుగునందు, జలం=నీటిని, పాతుం=త్రాగుటకొఱకు, గతాం=వచ్చిన, పిబంతీం=త్రాగుచున్న యాగోవును, వారయిత్వా= చాలింపచేసి, పశ్చాత్= తర్వాత, అసౌ=ఈ, వణిక్=వర్తకుడు, తోయం= నీటిని, పపౌ=త్రాగెను.

తా॥ ఎండచే చాల డస్సినదై యా మడుగునందుండు జలము పానముచేయు నభిప్రాయముగలదై త్రాగుచున్న గోవు నావలతరిమి తానా మడుగున నుదకపానమునుచేసిన పాపిసుమా; యీవర్తకుఁడు.

శ్లో॥ కుబుద్ధి స్తేనపాపేన పుత్రహీనోనృపోఽభవత్ ।
కస్యచిజ్జన్మనఃపుణ్యా త్ప్రాప్తంరాజ్యమకంటకమ్॥

టీ॥ కుబుద్ధిః= మంచిబుద్ధిలేని యావర్తకుఁడు, తేన=ఆ, పాపేన = పాపముచేత, పుత్రహీనః= కుమారులులేని, నృపః=రాజై, అభవత్ = పుట్టెను, కస్యచిత్= ఒకానొక, జన్మనః= పుటకయొక్క, పుణ్యాత్= పుణ్యమువల్ల, అకంటకం = శత్రువులులేని, రాజ్యం= రాజ్యము, ప్రాప్తం= పొందబడినది.

తా॥ అట్టి చెడుబుద్ధిగల యావర్తకుడు పూర్వార్జితమయిన యాపాపముచేత పుత్రులులేని రాజ జన్మకలవాఁడాయెను. అట్టి పాపికీ రాజ్యమెట్లు వచ్చెనంటే తత్పూర్వజన్మార్జితమైన పుణ్యవిశేషముచేఁ గలిగినదని జెప్పెను.

జనాః॥ శ్లో॥ పుణ్యాత్పాపంక్షయంయాతి పురాణంశ్రూయతేమునే।
పుణ్యోపదేశంకథయ తేనపాపక్షయోభవేత్॥

టీ॥ హేమునే= ఓలోమశమహామునీ! పుణ్యాత్ = పుణ్యమువల్ల, పాపం= పాపము, క్షయం= నాశనమును, యాతి= పొందుచున్నది. ఇతి=అని, పురాణం=పురాణము, శ్రూయతే= వినఁబడుచున్నది. తతః=ఆహేతువువల్ల, యథా=యేప్రకారము, భవత్ప్రసాదేన= మీయనుగ్రహమువల్ల, భూపతేః= రాజుకు, పుత్రః= కుమారుడు, భవేత్= కలుగునో, తథా= అప్రకారము, పుణ్యోపదేశం= పుణ్యమయిన యుపదేశమును, కథయ= చెప్పుము, తేన= ఆయుపదేశముచేత, పాపక్షయః = పాపనాశనము, భవేత్ = అవును.

తా॥ అయ్యా! పుణ్యముచేసిన యెడల పాపము నశించునని

పెద్దలు పురాణములయందు సూచించిరిగదా. ఆవాక్యము ననుసరించి నాకు పుణ్యము కలుగ నుపదేశముచేసిన యెడల నాపుణ్యముచే పూర్వ జన్మార్జితమైన రాజుచేసిన పాపము నశించునని ప్రజలు నుడివిరి.

లోమశః॥ శ్లో॥ ఏకాగ్రమానసో భూత్వా సత్యస్య వ్రతమాచరేత్।
వ్రతస్యాస్య ప్రభావేన పుత్రవాన్సభవిష్యతి॥

టీ॥ సః=ఆరాజు, ఏకాగ్రమానసః=స్థిరచిత్తముగలవాఁడై, భూత్వా=ఉండి, సత్యస్య= సత్యనారాయణునియొక్క, వ్రతం= వ్రతమును, ఆచరేత్ = చేయవలయు, అస్య=ఈ, వ్రతస్య= వ్రతముయొక్క, ప్రభావేన = సామర్థ్యముచే, పుత్రవాన్= కుమాళ్ళుగలవాఁడై, భవిష్యతి= ఉండగలడు.

తా॥ ఆప్రజల పలుకులాలకించి లోమశమహాముని ఓ జను లారా! యీరాజు స్థిరచిత్తుఁడై సత్యనారాయణవ్రతము చేయనగు నట్లుచేసినచో నావ్రతప్రభావముచే పుత్రవంతుఁడగును.

శ్లో॥ వ్రతపుణ్యం ప్రదాతవ్యం యుష్మాభిస్తుకృతవ్రతైః॥
ఏవంశ్రుత్వాతతోవాక్యం ప్రణమ్యద్విజసత్తమమ్॥

టీ॥ కృతవ్రతైః, కృత= చేయబడిన, వ్రతైః= వ్రతముగల, యుష్మాభిః= మీచేత, వ్రతపుణ్యం= వ్రతముయొక్క పుణ్యము, ప్రదాతవ్యం= ఇవ్వతగినది. ఏవం= ఈప్రకారమయిన, వాక్యం = లోమశునివాక్యమును, శ్రుత్వా= విని, ద్విజసత్తమం= బ్రాహ్మణశ్రేష్ఠుని, ప్రణమ్య= నమస్కరించి.

తా॥ రాజసుఁడైన యీరాజట్లు చేయనొల్లనిచో మీరా వ్రత ముచేసి దానివల్ల కలిగిన పుణ్యము నారాజునకర్పింపుడు అని పలికిన మునిపలుకులాకర్ణించి యీముని శ్రేష్ఠునిగూర్చి నతులొనర్చి.

శ్లో॥ జగ్ముస్తేస్వపురంపశ్చా ద్రాజ్ఞోర్థేవ్రతముత్తమం।
కృత్వాసర్వేతత్రపుణ్యం తస్మైరాజ్ఞేదదుర్జనాః॥

టీ॥ పశ్చాత్ = తర్వాత, తే= వారలు, స్వపురం= తమపట్టణమును, జగ్ముః= పొందిరి. సర్వే= సమస్తమయిన, జనాః= జనులు, రాజ్ఞోర్థే= రాజునిమిత్తము, ఉత్త మం= శ్రేష్ఠమయిన, పుణ్యం=పవిత్రమయిన, వ్రతం = సత్యనారాయణవ్రతమును, తత్ర=ఆపట్టణమందు, కృత్వా=చేసి, తస్మై=ఆ, రాజ్ఞే=రాజుకొఱకు, దదుః=ఇచ్చిరి.

తా॥ పిమ్మట తమ పట్టణమునుగూర్చి వెళ్ళిరి. వెళ్లిన తక్షణ

మా ప్రజలు రాజునుద్దేశించి సత్యనారాయణవ్రత మాచరించి యా రాజున కర్పించిరి.

శ్లో॥ దత్తేపుణ్యేతురాజ్ఞీచ గర్భమాధత్తశోభనం ।
పరిపూర్ణేతుతత్కాలే సాతుపుత్రమజీజనత్॥

టీ॥ పుణ్యే= పుణ్యమును, దత్తే= ఇవ్వబడినదగుచుండగా, రాజ్ఞీచ= రాణియు న్నూ, శోభనం=యోగ్యమయిన, గర్భం= గర్భమును, ఆధత్త= ధరించెను. తత్కాలే= ఆగర్భకాలము, పరిపూర్ణే= సమాప్తియయిన దగుచుండగా, సాతు= ఆరాణి, పుత్రం= కుమారుని, అజీజనత్= కనెను.

తా॥ అట్లు ప్రజలు పుణ్యమును సమర్పించిన వెంటనే పట్టపు దేవి గర్భము దాల్చినదయి దశమాసపూర్తియైన వెనుక పుత్రు నొకని కనెను.

శ్లో॥ వ్రతప్రభావాత్పుత్రస్య ప్రాప్తౌరాజ్ఞోనరోత్తమాః।
పూర్ణిమాయాంతుసంక్రాంతౌ వేకాదశ్యాంతథైవచ।
కృత్వావ్రతంతేసత్యస్య చాంతేసత్యపురంయయుః॥

టీ॥ వ్రతప్రభావాత్= వ్రతమహాత్మ్యమువల్ల, రాజ్ఞః= రాజునకు, పుత్రస్య= కుమారునియొక్క, ప్రాప్తౌ= లాభానంతరము, నరోత్తమాః = నరశ్రేష్ఠులైన, తే= యాజనులు, పూర్ణిమాయాం= పూర్ణిమయందున్నూ, సంక్రాంతౌ= సంక్రమణమం దున్నూ, తథైవ= అప్రకారమే, ఏకాదశ్యాంచ = ఏకాదశియందున్నూ, సత్యస్య= సత్యదేవునియొక్క, వ్రతం= వ్రతమును, కృత్వా= చేసి, అంతేచ = అంతకాలమందు న్నూ, సత్యపురం= వైకుంఠమును, యయుః= వెళ్ళిరి.

తా॥ ఆవ్రతమహిమచే పుత్రుఁడు కలిగిన రాజును దృష్టాంత ముగా గ్రహించి అది మొదలు ఆప్రజలు మరణాంతమువఱకు పూర్ణి మసంక్రాంతి ఏకాదశీ మొదలగు పర్వములయందా వ్రతముచేసి వైకుంఠము చేరిరి.

శ్లో॥ ఏతద్వఃకథితంవిప్రాః సత్యస్యవ్రతముత్తమం ।
యత్కృత్వాపురుషైర్నూనం ప్రాప్యతేఫలమీప్సితమ్॥

టీ॥ హే విప్రాః = ఓ శౌనకాది ఋషులారా! యత్ = యే వ్రతమును, కృత్వా=చేసి, పురుషైః=పురుషులచే, నూనం= నిశ్చయముగా, ఈప్సితం=కోరబడిన,

ఫలం= ఫలము, ప్రాప్యతే= పొందబడును. తత్ = ఆ, ఏతత్ = ఈ, ఉక్తం= శ్రేష్ఠమయిన, సత్యస్య= సత్యనారాయణునియొక్క, వ్రతం= వ్రతము, వః = మీకు, కథితం= చెప్పఁబడినది.

తా॥ ఓశౌనకాది మహామునులారా! ఏవ్రతముచేత పురుషుఁడు కోరికలనొందునో అట్టి సత్యనారాయణవ్రతము మీకు నాచే చెప్పఁబడినది.

ఇతి సప్తమోఽధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ అష్టమోఽధ్యాయ ప్రారంభః. ♦—

శ్లో॥ అథాన్యాంసంప్రవక్ష్యామి కథాంపాపౌఘనాశినీం।
శృణుధ్వంమునయస్సర్వే పుణ్యాంపరమపావనీం।

టీ॥ హేమునయః= ఓ శౌనకాదిమునులారా! సర్వే = మీరందఱు, అథ= అనంతరము, పాపౌఘనాశనీం, పాప = పాపములయొక్క, ఓఘ = సమూహమును, నాశినీం= నశింపచేయు, పరమపావనీం, పరమ= మిక్కిలి, పావనం = పవిత్రమయిన, పుణ్యాం=పుణ్యమును కలుగచేయు, అన్యాం= మఱియొక, కథాం = కథను, సంప్రవక్ష్యామి= చెప్పెదను, శృణుధ్వం= వినుఁడు.

తా॥ ఓశౌనకాదిమునులారా! పాపములను బోగొట్టు పవిత్రమైన మఱియొక కథను చెప్పెదను వినుఁడు.

శ్లో॥ కదాచిత్కౌశికీతీరే దుష్టబుద్ధిరితిశ్రుతః।
కశ్చిత్కఠినచిత్తోఽస్తి నిర్గుణోమానవాధమః॥

టీ॥ కదాచిత్ = ఒకానొక కాలమందు, కౌశికీతీరే = కౌశికి నదిఒడ్డున, నిర్గుణః= మంచిగుణములు లేనట్టి, మానవాధమః= మనుష్యాధముఁడయిన, దుష్టబుద్ధిరితి= దుష్టబుద్ధిఅని, శ్రుతః= కీర్తిగల, కశ్చిత్ = ఒకానొక, కఠినచిత్తః = కఠినమనస్సు కలవాడు, అస్తి = కలఁడు.

తా॥ ఒకానొక కాలమందు కౌశికీనది ఒడ్డున సుగుణములు లేని మనుష్యాధముఁడయిన దుష్టబుద్ధియను పేరుగల యొకానొక దుర్మార్గుఁడు కలఁడు.

శ్లో॥ విద్యాహీనో దరిద్రశ్చ నిత్యం చరతి పత్తనే।
ఏవం విధోఽప్యసౌ మూర్ఖో ధనార్జన ముపాయవిత్॥

టీ॥ విద్యాహీనః = చదువు లేనట్టివాఁడును, దరిద్రః = ధనములేని, అసౌ = ఈ, మూర్ఖః = మూర్ఖుడు, ఏవం విధోఽపి = ఈలాటివాఁడైనను, ఉపాయవిత్ = ఉపాయము తెలిసినవాఁడై, ధనార్జనం = ధనము సంపాదించుటను గూర్చి, నిత్యం = ప్రతిదినము, పత్తనే = పట్టణమందు, చరతి = తిరుగుచున్నవాఁడు.

తా॥ మూర్ఖుఁడైన యీదుష్టబుద్ధి యనువాఁడు విద్యాధనములు లేని వాఁడైనను ధనమును సంపాదించు నుపాయమును మాత్రము తెలిసినవాఁడై ధనసంపాదన నిమిత్తము ప్రతిపట్టణమందు దిరుగుచుండెను.

శ్లో॥ అన్యాయోపార్జితం విత్తం కోటిద్వయ ముపేయివాన్।
దానధర్మ విహీనస్సన్ ద్రవ్యార్జనపరోఽభవత్॥

టీ॥ అన్యాయోపార్జితం, అన్యాయ = న్యాయము లేకుండా, ఉపార్జితం = సంపాదించఁబడిన, విత్తం = ధనమును, కోటిద్వయం = రెండుకోట్ల ద్రవ్యమును, ఉపేయివాన్ = పొందినవాఁడై, దానధర్మ విహీనస్సన్, దాన = దానముతో, ధర్మ = ధర్మముతో, విహీనస్సన్ = శూన్యుఁడయినవాఁడై, ద్రవ్యార్జనపరః, ద్రవ్య = ద్రవ్యముయొక్క, ఆర్జన = సంపాదించుటయందు, పరః = ఆశక్తిగలవాఁడై, అభవత్ = ఉండెను.

తా॥ ఆదుష్టబుద్ధియనువాఁడు అన్యాయముగా రెండు కోట్ల ద్రవ్యమును సంపాదించినన్ని, దానధర్మములను చేయుటయం దాసక్తి లేకనే యింకను ద్రవ్యమును సంపాదించుటయందే యభిప్రాయము కలవాఁడై యుండెను.

శ్లో॥ దేవతారాధనం లోకే మూర్ఖాః కుర్వంత్యపండితాః।
సత్యనారాయణం దేవం యజంతి పరమాద్భుతమ్॥

టీ॥ లోకే = లోకమందు, మూర్ఖాః = మూర్ఖులు, అపండితాః = జ్ఞానములేనివారై, దేవతారాధనం = దేవతాపూజను, కుర్వంతి = చేయుచున్నారు, సత్యనారాయణం = సత్యనారాయణుఁడను, దేవం = దేవుని, యజంతి = పూజచేయుచున్నారు, పరమాద్భుతం = మిక్కిలి యాశ్చర్యము.

తా॥ మూర్ఖులు జ్ఞానములేక లోకములో దేవతారాధనము

చేయుచున్నారు. ఈ సత్యనారాయణుని పూజించుట చాల ఆశ్చర్య ముగా నున్నది.

శ్లో॥ బుద్ధిహీనాశ్చ తేసర్వే ద్రవ్యంవ్యర్థంత్యజంతిహి ।
దేవతారాధనేనైవ ధనప్రాప్తిఃకథంభవేత్॥

టీ॥ సర్వే= సమస్తమైన, తే= ఆదేవతారాధనముచేయువారు, బుద్ధిహీనాః= జ్ఞానములేనివారై, ద్రవ్య= ద్రవ్యమును, వ్యర్థం= వ్యర్థముగా, త్యజంతిహి= విడుచుచున్నారుగదా, దేవతారాధనేనైవ= దేవతను కొలుచుటచేతనే, ధనప్రాప్తిః= ధనలాభము, కథం= ఎట్లు, భవేత్= కలుగును.

తా॥ ఈదేవతారాధనము చేయు మూఢులందఱు జ్ఞానములేక ద్రవ్యమును వృధాగా వ్యయముచేయుచున్నారు. ఈ దేవతారాధనమువల్ల ధనలాభము ఎట్లు కలుగును.

శ్లో॥ భూయాసుస్సర్వలోకాశ్చ ధనవంతస్తథాసతి ।
మయాపూజాకృతాకస్య దేవస్యసుదృఢంసదా॥

టీ॥ తథాసతి= ఆదేవపూజవల్ల, ధనముకలిగినట్లయితే, సర్వలోకాశ్చ= సమస్తలోకములు. ధనవంతః= ధనముగలవి, భూయాసుః= అయ్యేవి, మయా= నాచేత, సదా= ఎల్లప్పుడు, కస్య=యే, దేవస్య= దేవునియొక్క, పూజా = పూజను, సుదృఢం= బాగుగా, కృతా= చేయబడినది.

తా॥ దేవతాపూజవల్ల ధనముకలిగేయెడల లోకము లన్నియు ధనముగలవియేయగును. నేను ధనవంతుడనగుటకు నేనే దేవుని పూజను బాగుగా చేసితిని.

శ్లో॥ త్వయాచారాధితస్సత్యం సత్యనారాయణప్రభుః ।
దదాతిధనమేతత్తే నోచేద్ద్రవ్యంకథంభవేత్॥

టీ॥ త్వయాచ= నీచేతనున్నూ, సత్యనారాయణప్రభుః= సమర్థుడైన సత్యనారాయణమూర్తి, ఆరాధితః= సేవించబడినవాడై, తే= నీకు, ఏతత్ = ఈధనం ధనమును, దదాతి= ఇచ్చుచున్నాడు. నోచేత్= అట్లు కానట్లయితే, ద్రవ్యం = ద్రవ్యము, కథం= యెట్లు, భవేత్= అవును.

తా॥ నీచేత సత్యనారాయణమూర్తి పూజించబడియె? ఈ

ధనమును కలుగజేసినాడు. అట్లు తాని యెడల నీకు ద్రవ్యము యెట్లు కలుగుసని యన్నట్లయితే.

శ్లో॥ పశ్యామిసత్యమాహాత్మ్యం మద్విత్తంనాశితంయది ।
దుష్టబుద్ధిఃకరోతీతి సత్యహేళనమన్వహమ్॥

టీ॥ తేన = ఆదేవునిచే, మద్విత్తం = నాధనము, నాశితంయది = నశింపచేసి నట్లయితే, సత్యమాహాత్మ్యం = సత్యనారాయణుని మాహాత్మ్యము, పశ్యామి=చూచుచున్నాను. ఇతి= ఈప్రకారము, దుష్టబుద్ధిః = దుష్టబుద్ధియనువాడు, అన్వహం=ప్రతిరోజున, సత్యహేళనం= సత్యనారాయణుని నిందను, కరోతి= చేయుచున్నాడు.

తా॥ ఆసత్యనారాయణమూర్తి నా ద్రవ్యమును నశింపజేసి నట్లయితే అతని మాహాత్మ్యము చూచెదనని దుష్టబుద్ధి ప్రతిదినము సత్యనింద చేయుచుండెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరేదుష్టబుద్ధేర్మతిరథాభవత్ ।
వాణిజ్యార్థంససైన్యోహం వ్రజామివిషయాంతరమ్॥

టీ॥ ఏతస్మిన్= ఈ, అంతరే = మధ్యకాలమందు దుష్టబుద్ధేః = దుష్టబుద్ధికి అహం= నేను, ససైన్యః= సేవలతోకూడినవాడనై వాణిజ్యార్థం = వర్తకముకొఱకు విషయాంతరం = దేశాంతరమును వ్రజామి = వెళ్లుచున్నాను అని మతిః = బుద్ధి అభవత్= కలిగెను.

తా॥ ఈవిధముగా సత్యదేవుని హేళనచేయు కాలమందు సపరివారము దేశాంతరమునకు వర్తకము కొఱకు వెళ్లవలయునను బుద్ధి దుష్టబుద్ధికి కలిగినది.

శ్లో॥ ఇతినిశ్చిత్యమనసా ప్రయాణమకరోత్తదా ।
వృషభాన్భారవాహాంశ్చ శకటాన్విత్తపూరితాన్।
వివిధాన్రత్నసంఘాతాన్ ఆదాయానంతధీరయమ్॥

టీ॥ అనంతధీః = మిక్కిలిబుద్ధిగల, అయం = ఈదుష్టబుద్ధి, ఇతి = ఈప్రకారము, మనసా= మనస్సుచేత, నిశ్చిత్య= నిశ్చయించి, తదా = అప్పుడు = భారవాహాన్= బరువుమోయు, వృషభాన్= ఎద్దులను, విత్తపూరితాన్, విత్త = ధనముచే, పూరితాన్= నిండిన, శకటాన్= బండ్లను, వివిధాన్ = అనేకవిధములయిన, రత్నసంఘాతాన్= రత్నసమూహములను, ఆదాయ= తీసికొని, ప్రయాణం = ప్రయాణమును, అకరోత్ = చేసెను.

తా॥ ద్రవ్యము సంపాదింపవలయునందే బుద్ధిగల యాదుష్టబుద్ధి యీప్రకారము మనస్సుచే నిశ్చయించినవాఁడై తన్నగరమునందే బలుపు మోపుగల యెద్దులతోను బండ్లతోను అనేక రత్నసమూహములను తీసికొని దేశాంతరములనుగూర్చి ప్రయాణమాయెను.

శ్లో॥ విక్రీయసర్వరత్నాని తత్రతత్రమహాంత్యసౌ ।
అమితంద్రవిణంప్రాప్య పరానందమవాప్నుయాత్ ॥

టీ॥ అసౌ= ఈదుష్టబుద్ధి, తత్రతత్ర=అచ్చటచ్చట, మహాంతి= గొప్పవయిన, సర్వరత్నాని = సమస్తరత్నములను, విక్రీయ = అమ్మి, అమితం = మితిలేని, ద్రవిణం = ద్రవ్యమును, ప్రాప్య = పొంది, పరానందం = గొప్పసంతోషమును, అవాప్నుయాత్= పొందెను.

తా॥ ఈదుష్టబుద్ధి గొప్ప వెలగల యారత్నములను అచ్చటచ్చట విక్రయించినవాఁడై అందువలన విస్తార ధనమును బొంది మిక్కిలి సంతోషించెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరేతత్ర కశ్చిద్బ్రాహ్మణసత్తమః ।
వ్రతంచసత్యదేవస్య చకారమతిమాన్శుచిః॥

టీ॥ ఏతస్మిన్నంతరే= ఈప్రకారము సంతోషముగలిగినకాలమందు, తత్ర= ఆ దేశాంతరమందు, కశ్చిత్ =ఒకానొక, బ్రాహ్మణసత్తమః= బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, మతిమాన్ = జ్ఞానముగలవాఁడై, శుచిః = పరిశుద్ధుఁడై, సత్యదేవస్య = సత్యదేవుని యొక్క, వ్రతం= వ్రతమును, చకార= చేసెను.

తా॥ వర్తకముకొఱకు దేశాంతరము తిరుగుకాలమందచ్చట ఒకానొక బ్రాహ్మణశ్రేష్ఠుఁడు జ్ఞానముగలవాఁడై పరిశుద్ధుఁడై సత్యనారాయణమూర్తియొక్క వ్రతమును జేసెను.

శ్లో॥ వ్రతంద్రష్టుమనాహూతాః కేచిదాయాంతిమందిరం ।
ఆహూతాః కేచిదాయాంతి పారమార్థికయాధియా॥

టీ॥ మందిరం= ఆ బ్రాహ్మణగృహమునుగూర్చి, వ్రతం = సత్యనారాయణవ్రతమును, ద్రష్టుం = చూచుటకొఱకు, కేచిత్ = కొంతమంది, పారమార్థికయా= యథార్థమయిన, ధియా= బుద్ధితో, అనాహూతాః= పిలువనివారగుచూ, ఆయాంతి= వచ్చుచున్నారు. కేచిత్= కొంతమంది, ఆహూతాః=పిలువబడినవారై, ఆయాంతి= వచ్చుచున్నారు.

తా॥ ఆబ్రాహ్మణుని గృహమునకు సత్యనారాయణ వ్రతమును జూచుటకై కొంతమంది పిలువఁబడినవారై కొంతమందిపిలువఁబడనివారై కపటములేని బుద్ధితో వచ్చుచుండిరి.

శ్లో॥ ప్రార్థితోదుష్టబుద్ధిస్తు నాయాతిసపదిద్విజాః।
అనాగతోఽపిసత్యస్య హేళసంకృతవానితి॥

టీ॥ దుష్టబుద్ధిస్తు= దుష్టబుద్ధయితే, ప్రార్థితః= రమ్మనమని వానిచే ప్రార్థించబడినవాఁడైనను, హేద్విజాః= ఓశౌనకాదిమునులారా ! సపది = అప్పుడు, నాయాతి= వచ్చుటలేదు. అనాగతోపి= రాకున్నను, సత్యస్య= సత్యదేవునియొక్క, హేళనం= నిందను, ఇతి=ఈ చెప్పబోవుప్రకారము, కృతవాన్= చేసెను.

తా॥ ఈదుష్టబుద్ధి యాబ్రాహ్మణునిచే ప్రార్థనపూర్వకముగా పిలువఁబడియు వెళ్ళకపోయెను. ఆవ్రతమునకు వెళ్ళకపోవడమే గాకుండ నీప్రకారము సత్యదేవునియొక్క పూజను గుణించి నిందకూడా చేసినవాఁడాయెను.

శ్లో॥ ఆవయోరంతరంహిత్వా లజ్జామప్యతిమూఢధీః।
మామప్యాహూతవాన్మూఢః కింవక్ష్యేకాలవక్రతామ్॥

టీ॥ అతిమూఢధీః= మిక్కిలి జ్ఞానములేని యాబ్రాహ్మణుఁడు, ఆవయోః= తనయొక్క నాయొక్క, అంతరం= తారతమ్యమును, హిత్వా = విడిచి, లజ్జామపి= సమానముకానివాని పిలుచుటెట్లను లజ్జనున్నూ, హిత్వా = విడిచి, మూఢః = తెలివిలేనివాఁడై, మామపి= గొప్పధనికుఁడయిన నన్నును, ఆహూతవాన్ = పిలచినవాఁడు, కాలవక్రతాం, కాల = కాలముయొక్క, వక్రతాం = కుటిలత్వమును, కింవక్ష్యే= యేమి చెప్పను.

తా॥ ఈబ్రాహ్మణుఁడు నేను ధనికుడను తాను దరిద్రుడను విచారణలేని బుద్ధిగలవాఁడై సిగ్గును విడనాడి నన్నుకూడా పిలచినవాఁడాయెను. ఆహాఏమికాలముయొక్కమహిమయని నిందించినవాడు.

శ్లో॥ శిరసశ్చాలనంకృత్వా స్వదేశగమనంప్రతి।
ప్రేషయామాసతాన్సర్వాన్ సైన్యాన్ ధనసమన్వితాన్॥

టీ॥ శిరసః= శిరస్సుయొక్క, చాలనం= వంకించుటను, కృత్వా= చేసి, ధనసమన్వితాన్= ధనముతోకూడిన, తాన్=ఆ, సర్వాన్ = సమస్తమైన, సైన్యాన్=

సేనలను, స్వదేశగమనంకృత్వా - తన దేశమునకు ప్రయాణమునుగూర్చి, ప్రేషయా మాస= పంపెను.

తా॥ ఈబ్రాహ్మణుని పోగొట్టుకున్నదాయని తలనుపంకించి వెంటనే తనసేనలను, ధనముతోకూడా తనదేశమునకుప్రయాణముచేసెను.

శ్లో॥ కాంతారమార్గమధ్యేతు దస్యవోదదృశుర్ధనమ్ ।
తాన్హత్వాసర్వరత్నాని గృహీత్వాతదనంతరమ్॥

టీ॥ కాంతారమార్గమధ్యే, కాంతార= అడవియొక్క, మార్గ= త్రోవయొక్క, మధ్యే= మధ్యయందు, ధనం= ద్రవ్యమును, దస్యవః= దొంగలు, దదృశుః= చూచిరి, తదనంతరం= చూచినవెంటనే, తాన్= ఆసేనలను, హత్వా= చంపి, సర్వరత్నాని= సమస్తరత్నములను, గృహీత్వా= తీసికొనిరి.

తా॥ తర్వాత మార్గమధ్యమందున్న యడవియందు దొంగలు యీధనమును జూచి సేనలను కొట్టి ధనమును తీసికొని,

శ్లో॥ దుష్టబుద్ధింపరిగృహ్యాథ బబంధుఃకంఠపాదయోః ।
సమ్యక్సంతాడ్యతంత్యక్త్వా యయుశ్చోరాయథాగతమ్॥

టీ॥ అథ= తర్వాత, దుష్టబుద్ధిం= దుష్టబుద్ధిని, పరిగృహ్య= బట్టుకొని, కంఠపాదయోః= మెడకు పాదములకు, బబంధుః= కట్టిరి. తం= అట్లు కట్టి వానిని, సమ్యక్= దిట్టముగా, సంతాడ్య= కొట్టి, త్యక్త్వా= విడిచి, చోరాః= దొంగలు, యథాగతం= వచ్చినట్టుగా, యయుః= వెళ్లిరి.

తా॥ తర్వాత దుష్టబుద్ధినిపట్టి మెడకు కాళ్లకు అంట కట్టినవారై విశేషముగా దెబ్బలుకొట్టినవారై పిమ్మట యథాస్థానమును గురించి చోరులు వెళ్ళిరి.

శ్లో॥ ఏకాకీనిర్ధనోభూత్వా మనసేతివ్యచింతయత్ ।
సత్యపూజామదృష్ట్వాఽహం మనాదృత్యత్వరాన్వితః।
స్వదేశగమనంకృతవాంస్తస్మాద్దుఃఖంపరిజాయతే।
ఇతినిశ్చిత్యమనసా శపథంకృతవాంస్తదా॥

టీ॥ ఏకాకీ= ఒక్కడున్నూ, నిర్ధనః= ధనములేనివాడున్నూ, భూత్వా= అయి, మనసా= మనస్సుచేత, ఇతి= ఈ చెప్పబోవుప్రకారము, వ్యచింతయత్ = తలచెను, అహం= నేను, సత్యపూజాం= సత్యనారాయణపూజను, అదృష్ట్వా = చూడక, అనా

దృత్య= ఆదరణచేయక, త్వరాన్వితః= తొందరకలవాడనై, స్వదేశగమనం= నాదేశ
ముయొక్క ప్రయాణమును; కృతవాన్ = చేసితిని. తస్మాత్ = ఆ హేతువువల్ల,
దుఃఖం= దుఃఖము, ప్రజాయతే = కలుగుచున్నది. ఇతి = ఈలాగునని, మనసా=
మనస్సుచేత, నిశ్చిత్య= నిశ్చయించి, తదా= అప్పుడు, నియమం = ప్రతిజ్ఞను, కృత
వాన్= చేసినవాడాయెను.

తా॥ ఆ చోరులు సాధువుయొక్క సర్వస్వాపహృత ధనము పోయినవాడై
ఒంటరిగా నరణ్యమందుండి యిట్లాగాపలికెను. నేనుసత్యదేవునిపూజను
జూడక స్వామిని తిరస్కరించినవాడనయితిని. అందువలన నిట్టి దుఃఖ
ము సంభవించెనని నిశ్చయించి ఒకానొక ప్రతిజ్ఞను జేసెను.

శ్లో॥ మత్సైన్యంమద్ధనంసర్వం పునరాగత్యమాంవిశేత్ ।
తదావిత్తానుసారేణ పూజయిష్యామిమాధవ॥

టీ॥ యదా= యెప్పుడు, హేమాధవా= ఓవిష్ణుమూర్తీ! మత్సైన్యం= నాయొ
సేనయున్నూ, మద్ధనం= నాయొక్క ధనమున్నూ, పునః = తిరిగి, ఆగత్య = వచ్చి,
మాం= నన్ను, విశేత్= ప్రవేశించునో, తదా= అప్పుడు, విత్తానుసారేణ = నాధన
మునకు తగినట్లుగా, పూజయిష్యామి= పూజింపగలను.

తా॥ ఓ విష్ణుమూర్తీ! యెప్పుడు నాసేనయున్నూ, నాధనము
యావత్తున్ను, తిరిగి నాకు చేరునో తత్క్షణము నాసంపత్తునకుం దగి
నటులు మీపూజను చేయుదునని దుష్టబుద్ధియనువాడు పలికెను.

శ్లో॥ ఇతిప్రార్థనతో దేవో దస్యుపాదాన్బబంధసః॥

టీ॥ ఇతి= ఈప్రకారము, ప్రార్థనతః= ప్రార్థించుటవల్ల, సః=ఆ, దేవః=
సత్యదేవుడు, దస్యుపాదాన్ ; దస్యు = దొంగలయొక్క, పాదాన్ = పాదములను,
బబంధ= కట్టివేసెను.

తా॥ ఈప్రకారము ప్రార్థింపబడిన విష్ణువు సత్యనారాయణ
మూర్తి దొంగలయొక్క పాదములను కట్టివేసెను.

శ్లో॥ అస్మాకంపాపచలనం కిముతత్కాంపత్యతిస్వయం ।
ఇతిచింతాంసమాపన్నా దస్యవస్సైనికాః॥

టీ॥ చోరాః= దొంగలు, అస్మాకం= మాయొక్క, పాపచలనం= పాదములు, పాద= పాదముల
యొక్క చలనం= కదలుట, స్వయం= తానంతట చేసెనా, కిమ్= [illegible]

నశ్యతి= నశించుచున్నది. ఇతి= ఈలాగునను, చింతాం = దుఃఖమును, సమాపన్నాః= పొందినవారై, ధనపేటికాః= ధనపు పెట్టెలను, దదృశుః= చూచిరి.

తా॥ దొంగలు చెప్పుచున్నారు. మాకు కాళ్లు కదలుటలేదు. కారణములేకుండా యెందుకై నశించుచుండెను. అని యీలాగున దుఃఖమును బొందినవారై ధనముగల పెట్టెలను జూచిరి.

శ్లో॥ తాసువృశ్చికసర్పాశ్చ స్థితాబుసబుసాయితాః।
సేటికాస్థధనంసర్వం చిత్రమంతరధీయత॥

టీ॥ తాసు = ఆపెట్టెయందు, వృశ్చికసర్పాః, వృశ్చిక = తేళ్లు, సర్పాః= పాములు, బుసబుసాయితాః=బుసబుసయని బుస్సులుకొట్టుచున్నవై, స్థితాః=ఉన్నవి. సర్వం= సమస్తమైన, పేటికాస్థధనం= పెట్టెలయందున్న ధనము, అంతరధీయత= అంతర్ధానమాయెను. చిత్రం= చిత్రము.

తా॥ ఆపెట్టెలయందుండు ధనము అంతర్ధానమై యుండెను. ఆపెట్టెలయందు తేళ్ళు పాములు బుసబుసయని ధ్వనిచేయుచున్నవై యుండెను. ధనమంతయు ఆశ్చర్యముకలుగునట్లు కనబడకయేపోయెను.

శ్లో॥ కిమిదంకస్యమాహాత్మ్యం మనోవాచామగోచరం।
ధనినస్తస్యసామర్థ్య మితిచక్రుర్వినిశ్చయమ్॥

టీ॥ ఇదం= ఇది, కిం= ఏమి, మనోవాచాం= మనస్సును వాక్కులకు, అగోచరం= కనబడని, మాహాత్మ్యం= మహిమ, కస్య = యెవ్వని సంబంధమయినది, ధనినః= ధనముగల, తస్య= ఆదుష్టబుద్ధియొక్క, సామర్థ్యం = సత్తువ, ఇతి = యీలాగునని, వినిశ్చయం= నిశ్చయమును, చక్రుః= చేసిరి.

తా॥ ఇదియేమి, మనోవాక్కులకు తెలియని మాహాత్మ్యము యెవనిదియని విచారించి యీమహాత్ము ధనాధిపతియైన దుష్టబుద్ధియొక్క సామర్థ్యమని నిశ్చయించిరి.

శ్లో॥ ఐంద్రజాలికవిద్యాయాం సంపృక్తస్సధనీకిల।
అస్మాభిర్బహుధాపూర్వం మాయాభిజ్ఞ ఇతిశ్రుతః॥

టీ॥ సః= ఆ, ధనీ= ధనవంతుడగువాడు, ఐంద్రజాలిక విద్యాయాం = ఇంద్రజాల విద్యయందు, సంపృక్తః= సమర్థుడనుట, అస్మాభిః= మాచేత, పూర్వం = పూర్వ

కాలమందు, బహుధా = అనేకమార్లు, మాయాగోష్ఠి ఇతి = మాయను తెలిసినవాడని, శ్రుతః= వినబడినవాఁడు.

తా॥ దుష్టబుద్ధియనువాఁడు యీద్రవ్యమును కథసతి. ఇతఁడు ఇంద్రజాల విద్యయందు సమర్థుఁడని పూర్వకాలమందనేక మారులు మాచేత వినబడినవాఁడు.

శ్లో॥ ద్రవిణంత్వీశ్వరోవేత్తి ప్రాణాఃకంఠగతాఃఖలు।
ప్రాణాస్తిష్ఠంతిచేద్ద్రవ్యం సుసంపాద్యంపునఃపునః॥

టీ॥ ద్రవిణంతు= ధనమునయితే, ఈశ్వరః= భగవంతుఁడు, వేత్తి= ఎరుఁగును. ప్రాణాః= ప్రాణములు, కంఠగతాఃఖలు= కంఠమును పొందినవిగదా, (అనఁగా పోయేటట్లున్నవియనుట) ప్రాణాః = ప్రాణములు, తిష్ఠంతిచేత్ = ఉన్నట్టులాయెనా, ద్రవ్యం= ద్రవ్యము, పునః పునః= మాటిమాటికి, సుసంపాద్యం= సుఖముగా సంపాదింపదగినది.

తా॥ ఆహా! ద్రవ్యమును దేవుఁడెఱుఁగును. ప్రాణములు పోవుచున్నవి. ప్రాణములున్నట్టయితే ద్రవ్యమును సుఖముగా తిఱిగి సంపాదించవచ్చును.

శ్లో॥ ఇతినిశ్చిత్యమనసా దుష్టబుద్ధేర్దదుర్ధనమ్॥

టీ॥ ఇతి= ఈ ప్రకారము, మనసా = మనస్సుచేత, నిశ్చిత్య = నిశ్చయించి, ధనం= ధనమును, దుష్టబుద్ధేః= దుష్టబుద్ధికి, దదుః= ఇచ్చిరి.

తా॥ ఈప్రకారము నిశ్చయించి ఆధనమును దుష్టబుద్ధికిచ్చిరి.

శ్లో॥ పునర్లబ్ధ్వాధనంసర్వం తత్రైవబహుభక్తితః।
సత్యనారాయణందేవం పూజయిత్వాయథావిధి।
దుష్టబుద్ధిస్తుసంతుష్టః స్వస్థచిత్తోఽభవత్తదా॥

టీ॥ పునః= తిరిగి, సర్వం=సమస్తమైన, ధనం = ధనమును, లబ్ధ్వా = పొంది, తత్రైవ= ఆ అరణ్యమందే, భక్తితః= భక్తితో, సత్యనారాయణం=సత్యనారాయణుడను, దేవం= దేవుని, యథావిధి= శాస్త్రోక్తముగా, పూజయిత్వా= పూజించి, దుష్టబుద్ధి= దుష్టబుద్ధియనువాడు, తదా= అప్పుడు, సంతుష్టః = సంతోషముగలవాఁడై, స్వస్థచిత్తః= స్థిరమయిన మనస్సుగలవాఁడై, అభవత్ = ఉండెను.

తా॥ అప్పుడు ఈదుష్టబుద్ధియనువాఁడు తిరిగి యాధనమును

బొంది అరణ్యమందే శాస్త్రప్రకారము సత్యనారాయణ వ్రతమును జేసి సంతోషయుక్తుఁడై యుండెను.

శ్లో॥ తతఃప్రయాణంకృతవాన్ దుష్టబుద్ధిర్మహాధనీ।
శకటేష్వర్థమాదాయ తదాస్వనగరంప్రతి॥

టీ॥ తతః=తర్వాత, మహాధనీ= మిక్కిలిధనవంతుఁడైన, దుష్టబుద్ధిః= దుష్టబుద్ధియనువాఁడు, శకటేషు= బండ్లయందు, అర్థం= ధనమును, ఆదాయ= ఉంచి, తదా= అప్పుడు, స్వనగరంప్రతి = తనపట్టణమునుగూర్చి, ప్రయాణం = ప్రయాణమును, కృతవాన్= చేసినవాఁడాయెను.

తా॥ పిమ్మట గొప్పధనికుఁడైన దుష్టబుద్ధి బండ్లతో ధనము తీసికొని తనపట్టణమునుగూర్చి ప్రయాణమును జేసినవాఁడాయెను.

శ్లో॥ గచ్ఛన్మార్గేదదర్శాసా వగాధాంమహతీంనదీం।
తర్తుకామోదుష్టబుద్ధి స్సమానీయత్వరాన్వితః॥

టీ॥ అసౌ= ఈ, దుష్టబుద్ధిః = దుష్టబుద్ధియనువాఁడు, గచ్ఛన్ = వెళ్లుచూ, మార్గే= మార్గమందు, మహతీం= గొప్పదయిన, అగాధాం= లోతుగల, నదీం= నదిని, దదర్శ= చూచెను. తర్తుకామః = దాటవలయునని కోరికగలవాఁడై, త్వరాన్వితః= తొందరగలవాఁడై, సమానీయ= ధనమును తీసి.

తా॥ ఆ దుష్టబుద్ధి వెళ్లుచూ మార్గమధ్యమందు లోతైన గొప్పనదిని జూచి దాటవలయునని కోరికగలిగి తొందర గలవాఁడై ధనమునుదీసి,

శ్లో॥ శకటస్థంధనంసర్వం నావ్యామారోపయత్తతః।
స్వయంచబంధుభిస్సార్థం నావమారుహ్యాగచ్ఛతి॥

టీ॥ తతః= తీసినతర్వాత, శకటస్థం= బండ్లయందున్న, సర్వం = సమస్తమైన, ధనం= ధనమును, నావ్యాం= పడవయందు, ఆరోప్య= ఎక్కించి, స్వయంచ= తానున్ను, బంధుభిస్సార్థం = బంధువులతోకూడా, నావం= పడవను, ఆరుహ్య= యెక్కి, గచ్ఛతి= వెళ్లుచున్నాఁడు.

తా॥ ధనమును బండ్లనుండి తీసి పడవయందుంచి తానును బంధువులతోకూడ పడవనెక్కి వెళ్ళుచుండెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరే తత్ర సత్యనారాయణః ప్రభుః ।
జిజ్ఞాసు స్తస్య హృదయం వృద్ధ బ్రాహ్మణరూపధృత్ ॥

టీ॥ ఏతస్మిన్నంతరే = [illegible], తత్ర = [illegible], ప్రభుః= సమర్థుఁడయిన, సత్యనారాయణః=సత్యనారాయణమూర్తి, తస్య= ఆదుష్ట బుద్ధియొక్క, హృదయం= మనస్సును, జిజ్ఞాసుః= తెలిసికొను నిచ్ఛకలిగి, వృద్ధబ్రాహ్మణరూపధృత్= ముసలి బ్రాహ్మణరూపమును ధరించినవాఁడై,

తా॥ నావయందు ధనమునుంచి దాటుకాలమందు సమర్థుఁడయిన సత్యదేవుఁడు దుష్టబుద్ధియొక్క మనస్సును తెలిసికొను నిచ్ఛకలిగి ముసలి బ్రాహ్మణరూపమును ధరించినవాఁడై,

శ్లో॥ తంధృష్ట్వాదుష్టబుద్ధింస మధురం శ్లక్ష్ణమబ్రవీత్ ।
బ్రాహ్మణోఽహందరిద్రశ్చ సత్యనారాయణంవ్రతమ్।
కర్తుకామోఽస్మి హేదుష్ట తదర్థమహమాగతః।
మహ్యామిచ్ఛానుసారేణ దేయంకించిద్ధనంత్వయా॥

టీ॥ సః=ఆముసలిబ్రాహ్మణుఁడు, తం= ఆ, దుష్టబుద్ధిం=దుష్టబుద్ధిని, దృష్ట్వా, చూచి, మధురం= ఇంపుగా, శ్లక్ష్ణం=మృదువుగా, అబ్రవీత్=పలికెను. అహం=నేను, బ్రాహ్మణః= బ్రాహ్మణుఁడను, దరిద్రః=ధనములేనివాడను, సత్యనారాయణవ్రతం= సత్యనారాయణవ్రతమును, కర్తుకామః= చేయవలయునను కోరికగలవాఁడను. హే దుష్టా= ఓదుష్టుఁడా! తదర్థం= ఆవ్రతముచేయుటకై, అహం= నేను, ఆగతః= వచ్చితిని, త్వయా= నీచేత, ఇచ్ఛానుసారేణ= [illegible], కించిత్= కొంచెము, ధనం= ధనము, మహ్యాం= నాకొఱకు, దేయం= [illegible].

తా॥ ఆ ముసలి బ్రాహ్మణుఁడైన సత్యదేవుఁడు దుష్టబుద్ధిని జూచి యీాదిగువ వాక్యమును ఇంపుగా మృదువుగా బలికెను. అది యేమనఁగా నేను బ్రాహ్మణుఁడను. ధనములేనివాడను, సత్యనారాయణ వ్రతమును జేయవలయునను కోరికగలవాడను. ఓదుష్టుఁడా! తాఁదినుటకన్న పరులకిచ్చుట యెక్కువఫలము గనుక ఆకోరికను తీర్చుకొనుటకు వచ్చిన నాకొఱకు కొంచెము ధనము నిమ్ము.

శ్లో॥ కించిన్మాత్రేణసంతుష్టో యాస్యేఽహమవిలంబితం ।
త్వద్దత్తేనధనేనైవ కరిష్యేవ్రతముత్తమమ్॥

టీ॥ అహం= నేను, కించిద్విత్తేన= కొంచెము ధనముచేతనే. సంతుష్టః = సంతోషించినవాడనై, అవిలంబితం= ఆలస్యము చేయకుండా, వక్ష్యే= చెప్పెదను. త్వద్దత్తేన= నీచేయిష్యఁబడిన, ధనేనైవ= ధనముచేతనే, ఉత్తమం= శ్రేష్ఠమైన, వ్రతం= సత్యవ్రతమును, కరిష్యే= చేసెదను.

తా॥ ఓదుష్టబుద్ధీ! నీవిచ్చు ధనముచే నాకు సంతుష్టికలుగునో లేదో యీధనము నింకొకరీతిగ వ్యయపఱచెదనేమో యను సందేహ మువలదు. నీవిచ్చినంతతో సంతోషించి దానిచే సత్యవ్రతమును త్వరలో చేసెదను.

శ్లో॥ వ్రతేనతుష్టోభగవాం స్తవశ్రేయోవిధాస్యతి।
ఇత్యుక్తవంతం తంవిప్రం దుష్టబుద్ధిఃప్రహస్యచ।
ఇదానీంనాస్తిమేవిత్తం గచ్ఛగచ్ఛద్విజోత్తమ।
తతోవిప్రస్తదాకర్ణ్య విస్మితస్తంజగాదహ॥

టీ॥ భగవాన్= భగవంతుఁడు, వ్రతేన=సత్యవ్రతముచేత, తుష్టః= సంతోషించినవాఁడై, తవ= నీకు, శ్రేయః= మంచిని, విధాస్యతి= చేయువాఁడు, ఇతి=ఈప్రకారము, ఉక్తవంతం= పలికిన, తం= ఆ, విప్రం = బ్రాహ్మణునిగూర్చి, దుష్టబుద్ధిః= దుష్టబుద్ధియనువాఁడు, ప్రహస్య= పరిహాసముచేసనవ్వి, హేద్విజోత్తమా= ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా! ఇదానీం=ఇప్పుడు, మే= నాకు, విత్తం= ధనము. నాస్తి=లేదు, గచ్ఛ గచ్ఛ= వెళ్లువెళ్లుఅనెను. తతః = పిదప, విప్రః = ముసలిబ్రాహ్మణుఁడు, తత్= ఆవెళ్లమనువాక్యమును, ఆకర్ణ్య= విని, విస్మితః= ఆశ్చర్యముకలవాఁడై, తం=ఆదుష్టబుద్ధినిగూర్చి, జగాదహ= పలికెను.

తా॥ ఈధనముగ్రహించి నేజేయు సత్యవ్రతముచే భగవంతుఁడు సంతోషించి నీకు మంచిని కలుగజేయునని చెప్పిన యాముసలి బ్రాహ్మణునిగూర్చి నవ్వి హాస్యముచేసి ఓబ్రాహ్మణుఁడా! యిప్పుడు నావద్ద ధనములేదు. వెళ్ళువెళ్ళుమని కఠినముగా పలికెను. పిమ్మట బ్రాహ్మణుఁడా వాక్యమునువిని యేమి యీదుష్టుఁడు ధనముండగా లేదని వచించినాడను నాశ్చర్యముగలిగి తిరుగ నుత్తరమిచ్చెను.

శ్లో॥ శకటేధనమాదాయ చాగతోఽసిధనాధిక।
ఇమాంనదీంతర్తుకామో నౌకయాదృఢయాఽధునా।

తదర్థపేటికానావ్యాం నిక్షిప్తాః పశ్యతో మమ।
నాస్తీతి వచనం కష్టం తేనార్హతి భవాన్ ధనీ॥

టీ॥ హే ధనాధికా = ఓధనముచే నధికుఁడైనవాఁడా! (అనఁగా ధనమదాంధుఁడా యనుట) శకటే= బండియందు, ధనం= ధనమును. ఆదాయ= తీసికొని, ఆగతః= వచ్చినవాడవు, అసి= అయితివి. అధునా= యిప్పుడు, ఇమాం = ఈ, నదీం= నదిని, దృఢయా= దిట్టమయిన, నౌకయా= పడవచేత, తర్తుకామః = దాటు కోరిక కలవాడవై, తదర్థపేటికాః= ఆబండియందుండిన ధనపుపెట్టెలు, మమ= నేను, పశ్యతః= చూచుచుండగా, నావ్యాం= ఓడయందు, నిక్షిప్తాః = ఉంచబడినవి. నాస్తీతి= ఉండగా లేదను, వచనం=వాక్యము, కష్టం= బహుకష్టమయినది. తేన = ఆహేతువుచేత, ధనీ= ధనవంతుఁడవయిన, భవాన్= నీవు, అర్హతి = ఇచ్చుటకు తగియున్నావు.

తా॥ ఓ ధనమదాంధుడా! ధనమును బండ్లతో తెచ్చి నదిని దాటుటకు నేను చూచుచుండగా పడవయందుంచిన దానిని లేదని చెప్పుట యెంతకష్టము? నీవు ధనవంతుడవగుటచే దానము చేయుటకు తగినవాడవు.

శ్లో॥ దేశే కాలే చ పాత్రే చ దత్తమక్షయమశ్నుతే।
పాత్రోఽహం బ్రాహ్మణో రిక్తః పూర్ణిమా తిథిరుత్తమా॥

టీ॥ దేశే= కాశ్యాది క్షేత్రములయందున్నూ, కాలే= పర్వాదికాలములయందున్నూ, పాత్రే = యోగ్యతగల పాత్రయందున్నూ, దత్తం = యివ్వబడినదానిని, అక్షయం= నాశనములేకుండా, అశ్నుతే = అనుభవించుచున్నాడు. రిక్తః = దరిద్రుఁడయిన, బ్రాహ్మణః= బ్రాహ్మణుఁడయిన, అహం= నేను, పాత్రః = యిచ్చుటకు తగినవాడను. పూర్ణిమా= పూర్ణిమయను, తిథిః= రోజు, ఉత్తమా = శ్రేష్ఠమయినది. (అనగా యోగ్యమయిన కాలపాత్రలు కూడినవనుట.)

తా॥ యోగ్యమయిన దేశమందు కాలమందు నిచ్చు ధనము సంపూర్ణఫలమునిచ్చునను న్యాయముకలదు. కనుక నేను దరిద్రుఁడనగు బ్రాహ్మణుఁడ నగుటచే దాన పాత్రుఁడను. శ్రేష్ఠమయిన పూర్ణిమాతిథియగుటచే కాలముకూడ యోగ్యమైనదిగదా.

శ్లో॥ త్వద్దత్తేన కరిష్యామి సత్యనారాయణవ్రతం।
సర్వం ధనం న యాచేఽహమల్పాన్మే ప్రీతిరుత్తమా॥

టీ॥ త్వద్దత్తేన = నీచే నివ్వఁబడిన ధనముచేత, సత్యనారాయణవ్రతం = సత్యనారాయణవ్రతమును, కరిష్యామి = చేసెదను. అహం = నేను, సర్వం = సమస్తమైన, ధనం = ధనమును, న యాచే = అడుగను. మే = నాకు, అల్పాత్ = కొంచెమువల్లనే, ఉత్తమా = శ్రేష్ఠమయిన, ప్రీతిః = సంతోషము, భవతి = అగుచున్నది.

తా॥ నీవు దానముచేసిన ధనముచే సత్యనారాయణ వ్రతమును జేసెదను. ధనమంతయు నాకక్కరలేదు. కొద్ది ధనము చేతనే మిక్కిలి సంతోషించెదను.

శ్లో॥ రూపికాంవాతదర్ధంవా దేయంవాకణికాపివా ।
నోచేద్గచ్ఛామి తేస్వస్తి స్యాదన్యంయాచయామ్యహమ్॥

టీ॥ రూపికాంవా = రూపాయియయినా, తదర్ధంవా = అర్ధరూపాయియైనా, కణికాపివా = పావలాయయినా, దేయం = ఇవ్వవలెగినది. నోచేత్ = అదియు లేదన్నట్టయితే, గచ్ఛామి = వెళ్ళుచున్నాను. తే = నీకొఱకు, స్వస్తి = మంగళము, స్యాత్ = అగును. అహం = నేను, అన్యం = మఱియొకరిని, యాచయామి = యాచించెదను.

తా॥ ఒక రూపికనో, అర్ధరూపికనో, పావలానో యిప్పింపుము. అదియు లేదంటివేని నీకు మంగళముగలుగుగాత నేనన్యుని యాచించెద.

శ్లో॥ తతోదుష్టజనోమత్తో హేలయాతంప్రహస్యచ ।
విప్రవేషధరశ్చోర స్త్వంధనంహర్తుమాగతః॥

టీ॥ తతః = పిమ్మట, దుష్టజనః = దుష్టబుద్ధియనువతఁడు, మత్తః = ధనముచే మదించినవాఁడై, హేలయా = నిర్లక్ష్యముచేత, తం = అతనిని, ప్రహస్య = హాస్యముచేసి, త్వం = నీవు, చోరః = దొంగవు, విప్రవేషధరః = బ్రాహ్మణవేషమును ధరించి, ధనం = ధనమును, హర్తుం = దొంగిలించుకొఱకు, ఆగతః = వచ్చితివి.

తా॥ బ్రాహ్మణుఁడీరీతిని పలికిన పిదప ధనముగల దుష్టబుద్ధి నిర్లక్ష్యముచే హాస్యముచేసి బ్రాహ్మణవేషముచే ధనము నపహరింపటకు వచ్చినావా యేమియని పలికెను.

శ్లో॥ మర్మభేదకవాక్యంహి దుష్టబుద్ధిరువాచహ।
నిష్ఠురంచవచశ్శ్రుత్వా సత్యనారాయణప్రభుః।
నవీనరోషసంయుక్త శ్శశాపకలినంతదా॥

టీ॥ దుష్టబుద్ధిః= దుష్టబుద్ధియనువాఁడు, మర్మభేదకవాక్యం, మర్మ= రహస్యమును, భేదక= భేదించునట్టి, వాక్యం= వాక్యమును, ఉవాచహ = పలికెను. సత్యనారాయణప్రభుః= నిగ్రహానుగ్రహ సమర్థుఁడయిన సత్యనారాయణమూర్తి, నిష్ఠురం= కఠినమయిన, వచః= వాక్యమును, శ్రుత్వా = విని, నవీనరోషసంయుక్తః, నవీన= నూతనమయిన, రోష= కోపముతో, సంయుక్తః= కూడినవాఁడై, తదా = అప్పుడు, కఠినం= కఠినముగా, శశాప= శాపమిచ్చెను.

తా॥ పిమ్మట మర్మమును భేదించునట్టి దుష్టబుద్ధియొక్క కఠినవాక్యమునువిని సమర్థుఁడయిన సత్యనారాయణమూర్తి యిది వరలో నశించి తిరిగి యీవాక్యమువల్ల నంకురించిన నూతనమయిన కోపము గలిగి కఠినముగ శాపమిచ్చెను.

శ్లో॥ దుష్టబుద్ధేఽతిమూఢ స్త్వం తవకష్టంభవత్వితి ।
ఏవముక్త్వాతతశ్శీఘ్రం బ్రాహ్మణఃకించిదంతరః॥

టీ॥ హేదుష్టబుద్ధేః = ఓదుష్టబుద్ధీ, త్వం = నీవు, అతిమూఢః = మిక్కిలి తెలివిలేనివాడవు, తవ= నీకు, కష్టం= దుఃఖము, భవతు = అవుగాక. ఇత్యేవం = ఈ ప్రకారము, ఉక్త్వా= పలికి, తతః= పిదప, శీఘ్రం= త్వరగా, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, కించిదంతరః= కొంచెముచాటుగలవాడు, అభూత్ = ఆయెను.

తా॥ ఓ దుష్టబుద్ధీ ! నీవు మూఢుఁడవు. ఇట్లు హాస్యముచేయుటచే నీకతి కష్టము గలుగుగాత అని శాపంబిచ్చి పిదప త్వరగా కొంచెము దూరము వెళ్ళి చాటుననున్నవాఁడాయెను.

శ్లో॥ నిర్గతేబ్రాహ్మణేసద్యో నౌర్మమజ్జజలేఽద్భుతమ్ ।
దుష్టబుద్ధిర్వేణుదండం సమాలంబ్యశనైశ్శనైః ।
నిమజ్యోన్మజ్జ్యతత్తీరం మావిశద్ద్విజసత్తమాః॥

టీ॥ బ్రాహ్మణే= బ్రాహ్మణుఁడు, నిర్గతే= వెళ్ళినవాడవుచుండగా, సద్యః= అప్పుడు, నౌః=పడవ, మమజ్జ= మునిగెను, దుష్టబుద్ధిః = దుష్టబుద్ధియనువాడు, వేణుదండం= పడవతీయు వెదుఱుఁగఱ్ఱను, సమాలంబ్య = పట్టుకొని, శనైశ్శనైః = మెల్లమెల్లగా, హేద్విజసత్తమాః = ఓశౌనకాదిమునులారా ! నిమజ్యోన్మజ్జ్య = మునిగి తేలుచు, తత్తీరం= ఆనదియొడ్డును, ఆవిశత్ = ప్రవేశించెను.

తా॥ ఆబ్రాహ్మణుఁడు వెళ్ళినతోడనే పడవ మునిగెను. దుష్ట

బుద్ధిమాత్రము పడవతీయు నెదురును తీసికొని మునుగుచు తేలుచు నదియొడ్డు చేరెను.

శ్లో॥ విలప్యబహుధాతత్ర మూర్ఛాంప్రాప్యస్మృతింతదా।
అవశిష్టోఽహమేకోవా సర్వంద్రవ్యంబలంసమం।
నౌకయాసహతోయేఽధః ప్రావిశన్మమకాగతిః॥

టీ॥ తత్ర= ఆనదీతీరమందు, బహుధా = అనేక విధములుగ, విలప్య = దుఃఖించి, మూర్ఛాం= మూర్ఛను, ప్రాప్య = పొంది, స్మృతిం = తెలివిని, ప్రాప్య= పొంది, తదా= అప్పుడు, అహం= నేను, ఏకః= ఒక్కడను, అవశిష్టః = మిగిలినవాడను. సర్వం= సమస్తమయిన, ద్రవ్యం= ధనమున్నూ, బలం= బలమున్నూ, నౌకయా సహ= పడవతోగూడ, సమం= ఒక్కమాటు, తోయే= ఉదకమందు, అధః= క్రింది ప్రదేశమును, ప్రావిశత్ = ప్రవేశించెను. మమ= నాకు, గతిః= దిక్కు, కా = ఏమి.

తా॥ ఆనదీతీరమందు క్రిందపడి విలపించి దేహస్మారకము తప్పినవాఁడై కొంత తడవునకు తెలివితెచ్చుకొని, నేనొక్కఁడను మిగిలితిని. ధనము బలము పడవతోగూడ నొక్కమారు నదియందు మునిగెను. నాకు దిక్కెవరని విచారించెను.

శ్లో॥ అహమేవంగృహంగత్వా కింభోక్ష్యేసుఖముత్తమమ్॥

టీ॥ అహం= నేను, ఏవం = ఈప్రకారము, గృహం = గృహమునుగూర్చి, గత్వా=వెళ్ళి,ఉత్తమం= శ్రేష్ఠమయిన,సుఖం=సుఖమును,భోక్ష్యేకిం=అనుభవించెదనా.

తా॥ ఈజగమున ధనమును బట్టియే భార్యాపుత్రాదు లుపచారములు చేయుదురు, గాన అట్టిధనమునువిడిచి గృహమునకువెళ్లి నయేమి సుఖమనుభవించెదను.

శ్లో॥ హాతాతతాతేతిరుదన్కరాభ్యాముదరస్సమావిధ్యపపాతభూమౌ।
మూర్ఛాంగతోథప్రతిపద్యసంజ్ఞామేవంవదన్శోకమవాపమూఢః॥

టీ॥ మూఢః = మూఢుఁడయిన యాదుష్టబుద్ధి, హా తాతతాత = ఓ నాయనా నాయనా, ఇతి = ఇట్లని, రుదన్ = యేడ్చుచు, కరాభ్యాం - చేతులచే, ఉదరం= రొమ్మును, సమావిధ్య= కొట్టుకొని, మూర్ఛాం= మూర్ఛను, గతః = పొందినవాడై, భూమౌ = భూమియందు, పపాత = పడెను, అథ = పిమ్మట, సంజ్ఞాం = తెలివిని,

ప్రతిపద్య= పొంది, ఏవం = ఈ దిగువ చెప్పబోవుప్రకారము, వదన్ = పలుకుచు, శోకం= దుఃఖమును, అవాప= పొందెను.

తా॥ మూఢుండయిన యానష్టబుద్ధి యంత యాపత్కాల మందయిన భగవంతుని తలచక నాయనా యనియే తలచుకొనుచు, చేతులచే నెత్తిని బాదుకొనుచు, నేడ్చుచు భూమిపై బడెను. అట్లు మూర్ఛిల్లి కొంత తడవునకు మేల్కాంచి యీదిగువ నుదహరించు రీతిగ దుఃఖమును జెందెను.

శ్లో॥ అదన్కదన్నం కృపణేనవృత్త్యా పిబన్యవాగూం లవణేనహీనాం।
క్రమేణవిత్తంసముపార్జితం యత్తదద్యనష్టం ప్రతికూలదైవాత్॥

టీ॥ కృపణేన= దీనమయిన, వృత్త్యా= ప్రవర్తనచేత, కదన్నం = అతిథిపూజాదికములేని యన్నమును, అదన్= తినుచు, లవణేన= ఉప్పుతో, హీనాం = శూన్యమయిన, యవాగూం = గంజిని, పిబన్ = త్రాగుచు, క్రమేణ = ఆయాసముచేత, యత్= యే, విత్తం= ధనము, సముపార్జితం= సంపాదించబడినదో, తత్= ఆద్రవ్యము అద్య=యిప్పుడు ప్రతికూలదైవాత్=ప్రతికూలుండయిన దైవమువల్ల ,నష్టం=నశించినది.

తా॥ ఆవాక్యములేవి యనిన దీనవృత్తిచే నతిథిపూజాదికము లేక నిందితమైన యన్నము భుజించి ఉప్పులేని గంజిత్రాగి కష్టముచే నార్జించిన ధనము నేటికి దైవానుగ్రహముదప్పి నశించెను.

శ్లో॥ మజ్జిష్యేఽహంజలేత్వద్య కింగృహంకిమువల్లభా।
లజ్జాంహిత్వాగృహంగత్వా కింకరోమితతఃపరమ్॥

టీ॥ అహం= నేను, అద్య= యిప్పుడు, జలే= నదీజలమందు, మజ్జిష్యే=మృతినొందెదను, గృహం= యిల్లు, కిం= యేమిప్రయోజనము. వల్లభా = భార్య, కిము= యెందుకు, లజ్జాం= ధనముపోయినదని సిగ్గును, హిత్వా= విడిచి, గృహం= యింటిని గూర్చి, గత్వా = వెళ్ళి, తతఃపరం = వెళ్ళినపిమ్మట, కింకరోమి = యేమిచేయుదును.

తా॥ నేనిప్పుడు జలపాతముచే మరణమునొందెదను. ధనము లేనిచో భార్యాగృహాదులుండియు నైహికప్రయోజనమేమియు లేదు. సిగ్గునువిడిచి ధనహీనుడనై యిల్లుచేరి పిదపచేయుపని యేమి.

శ్లో॥ ఏవంచింతయతస్తస్య మతిరాసీత్తదోత్తమా।
ధ్యానాచ్ఛ్రమాగతోవిప్రో మయాసమ్యక్ప్రతారితః॥

టీ॥ ఏవం= ఈప్రకారము, చింతయతః = విచారించుచున్న, తస్య = ఆదుష్ట బుద్ధికి, తదా= అప్పుడు, ఉత్తమా= శ్రేష్ఠమయిన, మతిః = బుద్ధి, ఆసీత్=కలిగెను. యాచ్నార్థం = యాచననిమిత్తము, ఆగతః = వచ్చిన, విప్రః = బ్రాహ్మణుఁడు, మయా= నాచేత, సమ్యక్= లెస్సగా, ప్రతారితః= వచించబడినవాఁడు.

తా॥ ఇట్లు విచారసాగరమందు మునుగుచు తేలుచున్న దుష్ట బుద్ధి ఆసముద్రము దాటుటకు తెప్పవలె నొకయుపాయముతోఁచినది. అది యేమనిన, యిదివఱలో యాచించుటకై వచ్చిన వేదపారగుఁడగు బ్రాహ్మణుని నేను మిక్కిలి తిరస్కరించితిని.

శ్లో॥ తస్మాదేతన్మహద్దుఃఖం జాతంతత్రనసంశయః ।
విప్రవేషధరోనూనం సత్యనారాయణప్రభుః ।
బ్రహ్మవాశంకరోవాస్యాన్నోచేదేవంభవేత్కథమ్॥

టీ॥ తస్మాత్= ఆతిరస్కారరూప హేతువుచేత, ఏతత్ = ఈ, మహత్= గొప్పదయిన, దుఃఖం= దుఃఖము, జాతం = కలిగినది. తత్ర = ఈ యూహాయందు, నసంశయః = సంశయములేదు. (అనఁగా నిశ్చయమనుట) నూనం= నిశ్చయముగా, విప్రవేషధరః= బ్రాహ్మణవేషమును దాల్చిన, సత్యనారాయణప్రభుః=సమర్థుఁడయిన సత్యనారాయణమూర్తియో, బ్రహ్మవా= బ్రహ్మదేవుఁడో, శంకరోవా = సాంబ మూర్తియో, నోచేత్= వారెవ్వరుకానట్టయితే, ఏవం= ఈప్రకారము, కథం= యెట్లు, భవేత్= అవును.

తా॥ ఆబ్రాహ్మణుని తిరస్కరించినమూలముగ యిట్లు గొప్ప దుఃఖము కలిగినది. ఈబ్రాహ్మణరూపుఁడగువాడు సత్యనారాయణ మూర్తియో, బ్రహ్మయో, సాంబమూర్తియోనై యుండవలయు ను. లేకున్న యిట్లు పలికిన వెంటనే కష్టమెట్లు గలుగును.

శ్లో॥ తదన్యోబ్రాహ్మణఃకర్తుం నశక్నోతినసంశయః।
అతస్తంశరణంయామి వాంఛితార్థప్రదోభవేత్॥

టీ॥ తదన్యః=వారికంటె నితరుఁడయిన, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, కర్తుం ఇట్లు చేయుటకై, నశక్నోతి= సమర్థుఁడుకాఁడు. నసంశయః = ఇంతున సంశయము లేదు. అతః= ఆహేతువువల్ల, తం= బ్రాహ్మణుని, శరణం= రక్షకునిగా, యామి= పొందుచున్నాను. వాంఛితార్థప్రదః= కోటిన కోటికలనిచ్చువాడు, భవేత్ =అవును.

తా॥ అట్లు బ్రహ్మవిష్ణు మహేశ్వరులలో నొకరుగాకున్న నితర బ్రాహ్మణుఁడిట్లు కష్టము కలుగజేయుటకు సమర్థుఁడుకాడు. సంశయములేదు. కాన కోటిన కోటికలిచ్చు నాబ్రాహ్మణుని రక్షింపుమని వేడెదను.

శ్లో॥ క్షమస్వచాపరాధంమే యదుక్తంతవసన్నిధౌ ।
ఏవముక్త్వాపునర్నత్వా మహాశోకాకులోఽభవత్ ॥

టీ॥ తవ = నీయొక్క, సన్నిధౌ=సమీపమందు, యత్ = యే అపరాధము, ఉక్తం= పలుకఁబడినదో, తత్ = ఆ, అపరాధం= తప్పును, క్షమస్వ= మన్నించుము. ఏవం= ఈప్రకారము, ఉక్త్వా=పలికి, పునః= తిరుగ, నత్వా = నమస్కరించి, మహాశోకాకులః= గొప్పదుఃఖముగలవాఁడై, అభవత్ =ఉండెను.

తా॥ ఇట్లు మనస్సున నూహించినవాఁడై పిదప యిదివరలో నీవద్ద పలికిన దోషపు పలుకును, క్షమింపుమని పలికి తిరిగి నమస్కరించి మిక్కిలి దుఃఖము చెందెను.

శ్లో॥ తతాన్తరేమహావిప్రో హ్యావిరాసీద్ధసన్ముఖః ।
ప్రోవాచవచనంవిప్రో విలపన్తంధనాధిపమ్॥

టీ॥ తతాన్తరే= అంతలో, మహావిప్రః= గొప్పబ్రాహ్మణుఁడు, హసన్ముఖః= నవ్వుచున్నముఖంగలవాఁడై, ఆవిరాసీత్ = ప్రత్యక్షమాయెను. విప్రః= ప్రత్యక్షమైన బ్రాహ్మణుఁడు, విలపంతం= దుంఖించుచున్న, ధనాధిపం = ధనపతియయిన దుష్టబుద్ధినిగూర్చి, వచనం= వాక్యమును, ఉవాచ= పలికెను.

తా॥ అంతలో నాబ్రాహ్మణశ్రేష్ఠుఁడు నవ్వుచు ప్రత్యక్షమాయెను. అట్లు ప్రత్యక్షమయి దుఃఖించుచున్న దుష్టబుద్ధినిగూర్చి ఈ దిగువరీతిగా వచించెను.

శ్లో॥ మారోదీశ్శ్రిణుమద్వాక్యం మమపూజాబహిర్ముఖః ।
మామవజ్ఞాయదుర్బుద్ధే లబ్ధవాన్దుఃఖమీదృశమ్॥

టీ॥ మారోదీః=దుఃఖించకుము. మద్వాక్యం= నావాక్యమును, శ్రిణు=వినుము. హేదుర్బుద్ధే= ఓదుష్టబుద్ధీ ! మమ=నాయొక్క, పూజాబహిర్ముఖః, పూజా=పూజను, బహిర్ముఖః= వెలుపలనున్నవాడవు (అనఁగా పూజను చేయని వాడవనుట) మాం= నన్ను, అవజ్ఞాయ= లక్ష్యముచేయక, ఈదృశం = ఇట్టి, దుఃఖం = దుఃఖమును, లబ్ధవాన్= పొందినవాడవు.

తా॥ ఓదుష్టబుద్ధీ! నీవు దుఃఖించకుము. నామాటనువినుము. నాపూజచేయక నన్నవమానించుటచే నీకిట్టికష్టములు సంభవించెను.

శ్లో॥ వ్రతంకర్తుం ప్రతిజ్ఞాయ గృహంగత్వా తతఃకురు।
సత్యనారాయణం దేవం మాంవిద్ధికరుణానిధిమ్॥

టీ॥ వ్రతం= సత్యవ్రతమును, కర్తుం= చేయుకొఱకు, ప్రతిజ్ఞాయ= ప్రతిజ్ఞ చేసి, గృహం= ఇంటినిగూర్చి, గత్వా= వెళ్ళి, తతః = పిమ్మట, కురు = చేయుము. మాం= నన్ను, సత్యనారాయణం= సత్యనారాయణుఁడను, దేవం = దేవునిగను, కరుణానిధిం= దయాస్థానముగను, విద్ధి= తెలిసికొనుము.

తా॥ వెంటనే సత్యనారాయణవ్రతము చేసెదనని పలికితివి గాన ఈవ్రతము మీగృహంబున జరుపుము, నావాక్యము సత్య దేవునిగ నెరుంగుము.

శ్లో॥ త్వదభిప్రాయమాజ్ఞాతుం ప్రాదుర్భూత్వా సమాహితః।
ఏతత్సర్వమహంకుర్వే మదన్యోబ్రాహ్మణోనహి॥

టీ॥ అహం= నేను, త్వదభిప్రాయం= నీయొక్క అభిప్రాయమును, ఆజ్ఞాతుం= సమస్తము తెలియుకొఱకు, ప్రాదుర్భూత్వా= ప్రత్యక్షమయి, సమాహితః= నాసంగతిని తెలియచేయకుండా స్థిరచిత్తుఁడనైయున్నవాఁడ. ఏతత్ = ఈ, సర్వం = సమస్తమును, కుర్వే= చేయుచున్నాను, మదన్యః = నాకంటే యితరుఁడు, బ్రాహ్మణః= బ్రాహ్మణుఁడు, నహి= లేఁడు, (అనఁగా బ్రాహ్మణుఁడే నారూపుఁడనుట)

తా॥ నేను నీ మనోగతమగు నభిప్రాయమును తెలిసికొనుటకు ప్రత్యక్షమై నారూపమును తెలియపర్చక గంభీరుడనై యుంటిని. ఈ సమస్తమయిన కార్యజాతమును నేనే జేయుచున్నాను. నారూపము బ్రాహ్మణరూపముగా తెలిసికొనుము.

శ్లో॥ అజ్ఞాత్వామమమాహాత్మ్య మనుభూతంత్వయాధునా।
తచ్ఛ్రుత్వా భగవద్వాక్యం స్తోత్రంచక్రేప్రహృష్టధీః॥

టీ॥ మమ= నాయొక్క, మాహాత్మ్యం= మహత్తును, అజ్ఞాత్వా = తెలిసికొనలేక, త్వయా= నీచేత, అధునా= యిప్పుడు, అనుభూతం = కష్టమనుభవించబడినది. తత్ = ఆ, భగవద్వాక్యం= భగవంతునివాక్యమును, శ్రుత్వా = విని, ప్రహృష్టధీః= సంతోషించినబుద్ధిగలవాఁడై, స్తోత్రం= స్తోత్రమును, చక్రే= చేసెను.

తా॥ ఓదుష్టబుద్ధీ! నామహత్త్వమును తెలిసికొనలేక యిట్టికష్టములననుభవించితివని పలుకఁగా నావాక్యమునువిని సంతోషము కలవాఁడై స్తోత్రముచేసెను.

శ్లో॥ నౌరున్మమజ్జసబలా సధనాతత్క్షణాత్తతః।
దుష్టబుద్ధిస్తదాదాయ బలంద్రవ్యంగృహంయయౌ॥

టీ॥ తతః= స్తోత్రముచేసినతర్వాత, సబలా = సైన్యముతోకూడినట్టిన్ని, సధనా= ధనముతోకూడినట్టిన్ని, నౌః= ఓడ, తత్క్షణాత్ = ఆక్షణముననే, ఉన్మమజ్జ= తేలినది. దుష్టబుద్ధిః= దుష్టబుద్ధియనువాడు, తత్ = ఆ, బలం= బలమును, ధనం=ధనమును, ఆదాయ= తీసికొని, గృహం= యింటినిగూర్చి, యయౌ= వెళ్ళెను.

తా॥ స్తోత్రముచేసిన వెంటనే బలముతో ధనముతోగూడ నావతేలెను. దుష్టబుద్ధి సేనను నావను తీసికొని యింటికి వెళ్ళెను.

శ్లో॥ అత్యుత్సాహమనస్కస్సన్ వ్రతంచక్రేయథావిధి।
నిరోగంశుభమాయుష్యం సధనంప్రాప్తవాన్సుఖమ్॥

టీ॥ అత్యుత్సాహమనస్కస్సన్ = మిక్కిలి సంతోషయుక్తమయిన మనస్సుగలవాడగుచు, యథావిధి= శాస్త్రమునతిక్రమించకుండ, వ్రతం= వ్రతమును. చక్రే= చేసెను. సధనీ=ధనయుక్తుఁడై, నిరోగశతం=రోగరహితముగానూఱయిన, ఆయుష్యం= ఆయుర్దాయమునున్ను, సుఖం=సుఖమును, ప్రాప్తవాన్= పొందినవాఁడాయెను.

తా॥ మిక్కిలి సంతోషముతో యింటివద్ద సత్యనారాయణవ్రతము యథావిధిగ చేసెను. అట్లుచేయుటచేధనముసమృద్ధిగలవాఁడై రోగములేకుండనూఱుసంవత్సరములాయుస్సుకలిగిసుఖమనుభవించెను.

శ్లో॥ పక్షేపక్షేవ్రతంచక్రే సానందోభక్తిసంయుతః।
తదాదిదుష్టబుద్ధిస్తు సుబుద్ధిరితివిశ్రుతః।
ఇహాలోకేసుఖంభుక్త్వా సకళత్రస్సపుత్రకః॥

టీ॥ సానందః= సంతోషయుక్తుఁడై, భక్తిసంయుతః = భక్తికలవాఁడై, పక్షేపక్షే= ప్రతిపక్షమందు, వ్రతం= సత్యవ్రతమును, చక్రే = చేసెను. తదాది = అట్లువ్రతముచేసినది మొదలు, దుష్టబుద్ధిః= దుష్టబుద్ధియనువాడు, సుబుద్ధిరితి = మంచిబుద్ధిగలవాడని, విశ్రుతః= ప్రసిద్ధుఁడాయెను. ఇహ= ఈ, లోకే= లోకమందు,(అనగా

తానుండు భూలోకమందనుట) సకళత్రః= భార్యతోకూడినవాఁడై, సపుత్రకః=సమస్త పుత్రులు గలవాఁడై, సుఖం= సుఖమును, భుక్త్వా= అనుభవించి,

తా॥ అది మొదలు దుష్టబుద్ధి ప్రతిపక్షమందు భక్తియుక్తమైన యానందముతో సత్యనారాయణ వ్రతమునుజేసెను. అట్లు చేయుటచే దుష్టబుద్ధియనువాడు పూర్వనామమువదలి సుబుద్ధియను పేరును బొందెను. ఈ భూలోకమందు భార్యాపుత్త్రులతో సమస్త సుఖముల ననుభవించెను.

శ్లో॥ సురపతివరలోకే దేవతాసుందరీణాం। కుచతటపరిఘుష్టేనూన
దక్షప్రవక్షాః। సకలసురమునీంద్రై స్సేవ్యమానస్సభాయాం।
స్వకృతసుకృతభోగాన్ దేవరాజస్యభుఙ్క్తే॥

టీ॥ సురపతివరలోకే, సురపతి= దేవేంద్రునియొక్క, వర = శ్రేష్ఠమయిన, లోకే= లోకమందు, (అనఁగా స్వర్గమందు) దేవతాసుందరీణాం = దేవతాస్త్రీల యొక్క, కుచతటపరిఘుష్టే, కుచతట = స్తనప్రదేశములయొక్క, పరిఘుష్టే = మర్దించుటయందు, అనూనదక్షప్రవక్షాః, అనూన = జంకులేని, దక్ష = సామర్థ్యముగల, ప్రవక్షాః= వక్షస్థలముగలవాఁడై, సభాయాం= సభయందు, సకలసురమునీంద్రైః= సమస్తమునిశ్రేష్ఠులచేత, సేవ్యమానః= సేవించబడువాఁడై, దేవరాజస్య = దేవేంద్రుని సంబంధమయిన, స్వకృత సుకృతభోగాన్, స్వకృత = తనచే చేయబడిన, సుకృత= పుణ్యములయొక్క, భోగాన్= భోగములను, భుఙ్క్తే= అనుభవించుచున్నాడు.

తా॥ దేహానంతరము స్వర్గలోకమందు దేవతాస్త్రీలతోసంభోగముగలవాఁడై సమస్తమునులచే సేవించబడువాఁడై తానుచేసిన పుణ్యములచేత దేవలోకమందు దేవేంద్రభోగము ననుభవించెను.

ఇత్యష్టమోఽధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ నవమోఽధ్యాయ ప్రారంభః. ♦—

సూతః॥ శ్లో॥ అథాన్యత్సంప్రవక్ష్యామి సత్యనారాయణప్రభోః।
మాహాత్మ్యంసర్వపాపఘ్నం వక్తౄణాంశ్రోతౄణామపి॥

తా॥ ఇటుపిమ్మట చెప్పువారలకు, వినువారలకు సమస్త పాపములను నశింపజేయు సమర్థుఁడగు సత్యనారాయణమూర్తియొక్క మఱియొక మహిమను జెప్పెదను.

శ్లో॥ అవంతికానామపురీ కాచిదస్తిమహీతలే।
సర్వసంపత్సమాయుక్తా సర్వసౌభాగ్యసంయుతా॥

తా॥ ఓ శౌనకాదిమునులారా! భూతలమందు సమస్త సంపత్తులుగలదై సమస్త మంగళములు గలిగినట్టి యవంతియను నొక పట్టణము గలదు.

శ్లో॥ స్వాశ్రమాచారయుక్తానాం బ్రాహ్మణానాంవివేకినాం।
క్షత్రియాణాంవిశుద్ధానాం నీతిశాస్త్రానుగామినాం।
అథఃకృతకుబేరాణాం వైశ్యానాంధనసంపదాం।
బ్రహ్మశుశ్రూషణధియాం శూద్రాణాంశుద్ధచేతసాం।
ఏతేషాంస్థానభూతాయాం పుర్యామాస్తేపతివ్రతా॥

తా॥ తమతమ యాశ్రమాచార సంపన్నులయిన వివేకులగు బ్రాహ్మణులకును, నీతిశాస్త్రము ననుసరించి నడుచు పరిశుద్ధులయిన రాజులకును, విశేష ధనసంపత్తుగలవారై కుబేరుని తక్కువగా చూచెడు కోమట్లకును, చిత్తశుద్ధిగలిగి బ్రాహ్మణపరిచర్యయందాసక్తిగల బుద్ధిమంతులగు శూద్రులకును యిట్టి నాలుగు వర్ణములకు నునికిపట్టయిన యాయవంతియను పట్టణమం దొకానొక పతివ్రతయయిన స్త్రీకలదు.

శ్లో॥ కౌముదీతిప్రసిద్ధాఖ్యా కౌముదీవమనోరమా।
పుణ్యశీలాదయామూర్తిః కాచిత్సాధ్వీవణిక్సుతా।
విష్ణుపూజాపరానిత్యం శివపూజాపరాసతీ।
మాతాపితృవిహీనాచ పుత్రసోదరవర్జితా।
అనింద్యకర్మణాకాల యాపనంక్రియతేసదా॥

తా॥ ఆ పతివ్రతయయిన స్త్రీ కౌముదియను నామముచేప్రసిద్ధిగలదై నామమునకు సార్థకముగా వెన్నెలవలెనే ఆహ్లాదము చేయునదై పవిత్రమైన స్వభావముగలదై దయాయుక్తురాలై, ప్రతివ్రత

హైయొకానొక వర్తకుని కుమార్తెయై శివవిష్ణ్వారాధన యుక్త రాలై, తల్లిదండ్రులు లేనిదై పుత్రులను అన్నదమ్ములనుకూడ లేని దై యాపట్టణమందుండి దూషితముగాని పనుల నాచరించుచు సర్వ కాలము గడుపుచుండెను.

శ్లో॥ జన్మాంతరకృతాత్పాపా ద్బాల్యవైధవ్యసంయుతా।
శ్వశ్రూశ్వశురహీనాచ దేవరాదవివర్జితా॥

తా॥ ఇంక నెట్టిగుణములు కలదంటి రేని పూర్వజన్మమునసంపా దించిన పాపమువల్ల బాల్యమందే వైధవ్యమును బొందినదై అత్త మామలు లేనిదై, మఱదులయిన లేనిదై యుండెను.

శ్లో॥ తథాఽపిలోకేమహతీ పుణ్యాత్మాచపతివ్రతా।
గుణాలవాలాసాధ్వీచే త్యాహుర్బుధజనాస్సదా॥

తా॥ ఆరీతిగ సమస్త బంధుజనవిహీనమైనదగనుకనే స్వేచ్ఛా విహారమందు స్వాతంత్ర్యముగలదయినను లోకమందు తన్నుపండితు లందఱును మిక్కిలిపతివ్రత, సద్గుణములుగలది,గొప్పస్వభావముగలది సాత్త్వికగుణముగలదని యెల్లప్పుడు వచించునటులు, ప్రవర్తించెను.

శ్లో॥ ఏవంస్థితేతత్రపుర్యాం సత్యనారాయణవ్రతం।
కుర్వంతికారయంతిస్మ పుణ్యాత్మానోమహాధియః॥

తా॥ ఇట్లుండగా ఆపట్టణమందు పుణ్యాత్ములయిన పండితులు సత్యనారాయణ వ్రతమును చేయించుట, తాము చేయుట మొదలయినవి జరుపుచుండిరి.

శ్లో॥ యేయేకుర్వంతిసత్యస్య వ్రతంవాంఛితసిద్ధిదం।
తేషాంతేషాంవాంఛితార్థో భవిష్యతితదాతదా॥

తా॥ అట్లు జరుగుకాలమందు యెవరెవరీ సత్యనారాయణవ్రత ముచేసియుండిరో వారివారి కోరికలప్పుడప్పుడు జఱుగుచుండెను.

శ్లో॥ ఏవంజగతివిఖ్యాతం వృత్తాంతంశ్రుణ్వతీసతీ।
సంతానహీనాజగతి వంధ్యాస్తేలోకవిశ్రుతాః॥

తా॥ ఇట్లు జగమునందు ప్రసిద్ధమైన వ్యాపారమును పతివ్రత

యయిన యొకవంధ్యవిన్నదై లోకమందు సంతానములేనివారు వంధ్య అని చెప్పఁబడుదురుగదా యనుకొనెను.

సూతః॥ శ్లో॥ ఏతస్మిన్నంత రేతత్రి బ్రాహ్మణీకాచిద స్త్రిహి ।
సత్యదేవప్రసాదేన పుత్రరత్నమజీజనత్ ॥

తా॥ ఇట్లు జరుగుచుండగ నాపట్టణమందొకానొక బ్రాహ్మణ చిన్నదికలదు. ఆమెను సత్యనారాయణానుగ్రహముచే శ్రేష్ఠుఁడయిన పుత్రుఁడొకడు కలిగెను.

శ్లో॥ తద్వృత్తాంతంనిశమ్యాసా వంధ్యాహరిమథాబ్రవీత్ ।
హేసత్యదేవ హేనాథ మమపుత్రద్దదాసిచేత్ ।
మదైశ్వర్యానుసారేణ తవపూజాంకరోమ్యహమ్॥

తా॥ ఆ వృత్తాంతము నీగొడ్డురాలయిన చిన్నదివిని విష్ణువును గూర్చి యీచెప్పఁబోవు ప్రకారము పలికెను. ఓ సత్యనారాయణ మూర్తి! ఓపాలకుఁడా! నాకు పుత్రుని కలుగజేసినయెడల నాసంపదకు తగినటులు మీపూజ చేసెదను.

శ్లో॥ ఇతిసంప్రార్థ్యవచసా వైశ్యపత్నీమువాచహ ।
భోవైశ్యపత్నిత్వంచాపి ప్రార్థయేత్యాహపుత్రకమ్॥

తా॥ ఈప్రకారమావంధ్య వాక్యముచే ప్రార్థించి సమీపమందున్న యాకోమటి భార్యనుగూర్చి ఓవైశ్యపత్నీ, నీవునుకుమారుఁడు కలుగునట్లు ప్రార్థింపుమని పలికెను.

శ్లో॥ ఇతి హేళనవాక్యేన చోదయామాసతాందదా ।
తదాకర్ణ్యవచస్తస్యాః పరిహాసనపూర్వకం।
దదాసిచేజ్జగన్నాథ కరిష్యేవ్రతమద్భుతం।
ఇతిహేళనయావాక్య ముక్త్వాతూష్ణీంబభూవహ॥

తా॥ ఇట్లుపరిహాసచే దిక్కులేనియాకోమటి భార్యను ప్రోత్సాహపఱచెను. పరిహాసయుక్తమయిన గొడ్రాలివాక్యమునువిని ఓజగన్నాథుఁడా! పుత్రుఁడు కలిగినయెడల సత్యనారాయణవ్రతము చేసెదనని పరిహాసముగా పలికి యూరకుండెను.

శ్లో॥ తావన్మాత్రేణసంతుష్ట స్సత్యనారాయణప్రభుః।
స్వప్నకాలేతయాసార్థం సంగతింకృతవాన్ హరిః॥

తా॥ సర్వసమర్థుఁడయిన సత్యనారాయణమూర్తి ఇట్లు పరిహాసముచే ప్రార్థించిన మాత్రముననే సంతోషము కలిగినవాఁడై స్వప్నమందా స్త్రీతో సంగమము సలిపెను.

శ్లో॥ ప్రాతరుత్థాయసానారీ జ్ఞాత్వాతత్స్వప్నచేష్టితం।
కిమిదంమహదాశ్చర్యం స్వప్నచేష్టాభయంకరీ॥

తా॥ ఆ స్త్రీ సూర్యోదయకాలమున లేచినదై స్వప్నమందు జరిగిన వృత్తాంతమును దెలిసికొని యిదియేమి, గొప్ప యాశ్చర్యముగనున్నది. స్వప్నవ్యాపారము బహు భయంకరముగా నున్నదే యని యనుకొనెను.

శ్లో॥ గర్భోత్పత్తిర్భవేన్నూనం తదామమకాగతిః।
పరలోకభయంనాస్తి త్విహలోకభయంభవేత్॥

తా॥ ఈస్వప్నచర్యచే నిశ్చయముగా గర్భముకాగలదు.అట్లు గర్భవతి నయినప్పుడు నాకు గతియేమి? సాక్షాత్తుగా శ్రీహరివల్ల నిట్టి కార్యము గలిగినప్పుడు పరలోకమందు భయములేదుగాని, యిహలోకమందు తప్పక భయము కలుగును.

శ్లో॥ ఏకాకినీవిభర్త్రాఽహం సర్వబంధువివర్జితా।
అపవాదార్ణవంతర్తుం మశక్నోమిరమాపతే॥

తా॥ ఆవిధముగా నాలోచించి ఓ విష్ణుమూర్తీ! పెనిమిటి లేనిదాననై సమస్త బంధువులులేని నేనొక్కదానను యీయపవాదమను సముద్రము దాటుటకు సమర్థురాలనుగాను.

శ్లో॥ శరీరంమృత్యుసంయుక్తం మలాద్యైరపిదూషితం।
అస్థిస్తంభం స్నాయుబద్ధం పీనగ్రంచరణౌధ్రువమ్॥

తా॥ విచారించిచూచిన నీ శరీరము, జన్మముగల వస్తువులకెల్ల మరణముగలదను వ్యాప్తిచే, నెప్పటి కయిన మరణించునదే. అట్లు చనిపోయినను ప్రస్తుత మనుభవించుటకు తగినదేమోయని యా

లోచించినచో మలమూత్రాదులచే నిండినదై యెముకలను స్తంభములు కలిగి స్నాయువులచే కట్టఁబడి చర్మముచే కప్పఁబడియున్నది. నిశ్చయము.

శ్లో॥ అస్థిరంమాంససంయుక్తం క్షణభంగురమధ్రువం ।
ఏతద్దేహికథంప్రీత్యా పరివాదధురాంవహే॥

తా॥ ఇంక యెముకలతోను, మాంసములతోను కూడినదై క్షణములో నశించు స్వభావముగలది కనుక నస్థిరమయిన ఈదేహమును కాపాడుప్రేమతో స్థిరమయిన ఈయపవాదమను భారము నెట్లు వహించెదను.

శ్లో॥ తస్మాద్గాలాహాలంపీత్వా విసృజామ్యధునాంతనుం ।
ఇతినిశ్చిత్యమనసా విషంసంగృహ్యాయత్నతః।
పాత్రేసంస్థాప్యతత్పాతుం ప్రయత్నంకుర్వతీసతీ॥

తా॥ ఆ హేతువుచే నీయపవాదమును బోఁగొట్టుకొనుటకు విషపానముచేసి యస్థిరమయిన యీ దేహమును చాలించెదనని మనస్సున నిశ్చయ పఱచి విషమును ప్రయత్నముచే సంపాదించి యొక పాత్రయందుంచి త్రాగుటకు ప్రయత్నము చేయుచుండెను.

శ్లో॥ ఏవంస్థితేవిష్ణుమాయా రూపానిద్రాసమాగతా ।
ఆవృత్యతాంచప్రజ్ఞాంతు చకారమహతీబలాత్॥

తా॥ ఇట్లుప్రయత్నమందుండగ విష్ణుమాయారూపురాలయిన నిద్రాదేవివచ్చినదై యా స్త్రీ నావరించి తెలివిలేనిదానిగ చేసెను.

శ్లో॥ తత్కాలేసత్యదేవేన పాత్రంగరళపూరితమ్ ।
హృతంపశ్చాత్ప్రబుద్ధాసా రురోధబహుధాభృశమ్॥

తా॥ అట్లు నిద్రాయుక్తురాలయిన కాలమందు సత్యనారాయణునిచేత విషముతోనిండిన పాత్ర హరించబడెను. పిమ్మట కొంత తడవునకునిద్రమేల్కాంచినదై యాచిన్నదిమిక్కిలిదుఃఖమునుబొందెను

శ్లో॥ అనేకశోఽనేకధాతు మృతౌయత్నపరాఽభవత్ ।
అనేకశోఽనేకధాతు కృతం విఘ్నంమహాత్మనా॥

తా॥ ఇట్లు జఱిగిన పిదప ననేకమార్లు అనేక ప్రకారములుగా

మృతినొందుటకు ప్రయత్నించెను. ఆ సత్యనారాయణుండును అనేక పర్యాయములనేకరీతులుగ నాప్రయత్నమును విఘ్నము చేసెను.

శ్లో॥ విఘ్నైరపాస్తమరణా మనసాఇత్యచింతయత్ ।
అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మశుభాశుభమ్॥

తా॥ ఈవిధముగ విఘ్నములచేత లభింపని మృతిగలదై మనస్సున నిట్లాలోచనచేసెను. జన్మాంతరకృతమయిన కర్మము మంచిదయినను చెడుదయినను అనుభవించియే తీరవలయును.

శ్లో॥ నాభుక్తంక్షీయతేపాపం కల్పకోటిశతైరపి।
హరిణాపిహరేణాపి బ్రహ్మణాపిసురైరపి।
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుంనశక్యతే॥

తా॥ పాపము నూఱుకోట్ల కల్పములయినను అనుభవింపక తప్పదు. ఇంతయేల, బ్రహ్మ విష్ణు మహేశులయిన దేవతలయిన నుదుటవ్రాయు గీతను తప్పించలేరు.

శ్లో॥ ఇతిశాస్త్రంసమాలోచ్య స్వస్థచిత్తాబభూవహ ।
తతఃప్రభృతికాలేన గర్భచిహ్నస్ఫురంతిహి॥

తా॥ ఈరీతిని శాస్త్రముల నాలోచించి స్థిరచిత్తురాలై యుండెను. అది మొదలు కొంతకాలమునకు గర్భిణీ లక్షణము కాన్పించెను.

శ్లో॥ మిథోమిథశ్చతద్వార్తా తత్రతత్రశ్రుతాఖలు।
ఇతికేచిద్వదంత్యత్ర సమయేకేచిదాగతాః।
వ్రజంతికర్ణరంధ్రాంచ సంపిధాయతిశీఘ్రతః॥

తా॥ ఇట్లు జరుగుకాలమందు కొంతమంది వచ్చినవారై యొకరికొకరు నీవృత్తాంతమునే జెప్పుకొనుచున్నారని చెప్పిరి. మఱియొక సమయమందు కొంతమందివచ్చి యీవార్తనువిని చెవులు మూసికొని త్వరగా వెళ్లుచుండిరి.

శ్లో॥ కేచిద్వదంతిసానారీ దృఢచిత్తాపతివ్రతా ।
తత్రేదృశీకదాజాతా నకదాపీతినిశ్చయమ్॥

తా॥ కొందరు ఈస్త్రీ మిక్కిలి దృఢమయిన చిత్తముగల పతివ్రత. ఈమెయందిట్టివార్త యెన్నడు కలిగియుండదు. నిశ్చయమనిరి.

శ్లో॥ ఇత్యాదిజనవార్తాసు ప్రవృత్తాసుతదాతదా ।
ప్రస్ఫుటందాహ్యతంచిహ్నం దృష్ట్వాసర్వేమహాజనాః ।
చింతమానాస్తుతేసర్వే తూష్ణీంభూతాస్తదాఽభవన్ ॥

తా॥ ఈప్రకారము జనులవార్తలప్పుడప్పుడు జరుగుచుండగా సమస్తజనులు స్ఫుటమయిన గర్భచిహ్నమునుచూచి కొంతతడవు విచారించినవారై యూరకుండిరి.

శ్లో॥ గతేషునవమాసేషు దశమేమాసికౌముదీ ।
సహస్రసూర్యసంకాశం సుందరంమదనోపమం ।
అసూతబాలకంవంద్యం వ్యోమ్నోమధ్యగతేరవౌ ॥

తా॥ అంతట నవమాసంబులు గడవంగనే పదవమాసమందు ఆకౌముదీయను కోమటిచిన్నది వెయ్యిసూర్యులకీడై ప్రకాశించుచున్న మన్మథునిబోలియున్న సౌందర్యముగలసర్వజనవందనీయుండగుపుత్రుని సూర్యుడాకాశమధ్యమును బొందియుండగా ప్రసవించెను.

శ్లో॥ దేవదుందుభయోనేదుః పుష్పవృష్టిశ్చఖాచ్చ్యుతా ।
సజ్జనానాంహృదిబభౌ నాద్భుతాప్రీతిరంజసా ॥

తా॥ ఆ ప్రసవకాలమందు సత్యదేవుని మహిమచే కలిగినవాం డగుటచే దేవవాద్యములు మ్రోగినవి. సత్పురుషులయొక్క హృద యమం దాశ్చర్యకరమయిన ప్రేమ శీఘ్రముగా కలిగెను.

శ్లో॥ అక్షరస్వీకృతింతస్య వర్షేపంచమసంజ్ఞకే ।
కారయామాసతన్మాతా గురుణైవముదాసతీ ॥

తా॥ అట్లు జన్మించిన యీపిల్లవానికి ఐదవసంవత్సరము రాగా నాపిల్లవానితల్లి సంతోషముతో గురువుచేనక్షరాభ్యాసముచేయించెను.

శ్లో॥ విద్యారంభంతతశ్చక్రే గురుశ్శిష్యేఽతివత్సలః ।
సకృన్నిగదమాత్రేణ సర్వవిద్యావిశారదః ।
అభూత్పరమకారుణ్యా న్మాత్రినాగురుణాసమః ॥

తా॥ ఆరీతిగా నక్షరాభ్యాసమయినతర్వాత గురువు శిష్యుని యందతిప్రేమగలవాడాయెను. గురువు ఒక్కపర్యాయము మాత్రమే

చెప్పినవాఁడగుచుండగా సర్వశాస్త్రములయందు నేర్పుగలవాఁడై మిక్కిలి కరుణారూపుఁడై సుందరాకారముగలవాఁడై యుండెను.

శ్లో॥ తండ్రియొక్కదుష్టులనందరిని వారి గృహములు చేరువలో మంటేనుండి

చక్రితేదుష్టవాస్తేన సారాయణ సుఖాతుకేమే॥

తా॥ సజ్జనులు పెసమింటిలేని స్త్రీకి కలిగిన యాపిల్లవానిజూచి యీచిన్నవాఁడు దైవప్రసాదముచే కలిగినవాఁడు. మహానుభావుఁడని తెలిసికొని మిక్కిలి సంతోషముతోనుండిరి. కొందఱు దుష్టులు జ్ఞానములేని మిక్కిలి చెడుదైన యసూయభావము నవలంబించిరి.

శ్లో॥ రండాపుత్రోఽయమిత్యాహు ర్బాలకంగుణజాలకం।

పితరిస్వర్గతేపశ్చా త్త్వంజాతోఽసీత్యనామక॥

తా॥ అట్లు అసూయభావముగలవారై మంచిగుణములు గల యాపిల్లవానిని ఇతఁడు రండకు కలిగినవాఁడని అనుచుండిరి. ఇట్లా పిల్లవానితో పలికి నీవు నీతండ్రి చనిపోయినతర్వాతకలిగితివి. నీయజ్ఞానమేమి తెలిసికొనలేకుంటివిగదా యని పలికిరి.

శ్లో॥ జానాసిచేత్పితాపత్రి వత్సతేపదనామకిం।

వదస్వనోచేదద్యైవ శిరోనత్వావ్రజాధమ॥

తా॥ లేక తండ్రి నెఱిఁగినవాఁడవయిన యెడల నీ తండ్రియెచ్చటనున్నవాఁడో యతని నామధేయమేమో చెప్పుము. అట్లు చెప్పని యెడల తలవంచుకొని యింటికి వెళ్ళుము ఓ అధముడా యని పలికిరి.

శ్లో॥ ఇతిబ్రువత్స్వసత్స్వేషు రోషవిస్మితమానసః।

పునన్నిగృహ్ణంతితోఽక్రోధం శాంతోఽభూదయమర్భకః॥

తా॥ దుష్టజనులీ ప్రకారము పలుకుచుండగా రోషాశ్చర్యములు కూడిన మనస్సుగలవాఁడై యాపిల్లవాఁడు వచ్చిన కోపమును కనపడచక శాంతిగలవాఁడై యుండెను.

శ్లో॥ వరాటికాదిక్రీడాసు సర్వేషాముత్తమోత్తమః।

నానాశాస్త్రప్రసంగేషు విజయీబహుసంసది॥

తా॥ ఆ చిన్నవాడు గవ్వలాడుట మొదలగు నాటలయందు

అందరిలో శ్రేష్ఠుఁడగుచు ననేకపూజలు సభలయందనేక శాస్త్ర ప్రసంగములయందు జయము కలిగియున్నవాఁడు.

శ్లో॥ భీమవన్మల్లయుద్ధేషు ప్రతిమల్లవిభీషణః ।
ఈర్ష్యయాదుష్టమనసో హంతుమారేభిరేచతమ్॥

తా॥ ముష్టియుద్ధములయందు భీమునివలె శత్రువులయిన జెట్టీలకు భయమును చేయువాఁడు. ఇట్లుండఁగ దుష్టులు సహింపనివారై యాచిన్నవానిని చంపుటకు ప్రయత్నించిరి.

శ్లో॥ కదాచిత్సుప్తికాలేతు పాదౌబద్ధ్వాజలేఽక్షిపన్ ।
తద్బంధచ్ఛేదనంకృత్వా తీరంప్రాపాతిశీఘ్రతః॥

తా॥ అట్లు ఆదుష్టులు చంపనిచ్ఛతో నొకానొక కాలమందు పాదములనుకట్టి నదీజలమందు పడవైచిరి! అట్లు పడవేయఁగా నాబంధముల తెంచుకొని త్వరలో నదీతీరముచేరెను.

శ్లో॥ విషందదుర్దుష్టచిత్తాః కేచిత్కుంతేనతాడితాః ।
కేచిద్దావాగ్నిమధ్యస్థం కారయామాసురర్భకమ్॥

తా॥ ఆ చిన్నవానికి కొంతమందిదుష్టులువిషముపెట్టిరి. కొంతమంది బల్లెములచే పొడిచిరి. కొంతమంది వనాగ్నియందుంచిరి.

శ్లో॥ విద్యావినిర్జితాస్సంతో ఘాతుకంకర్మచక్రిరే ।
దుష్టాత్మభిఃపీడితోఽపి నాపాయంప్రాప్తవాన్సుధీః॥

తా॥ ఆచిన్నవాని విద్యలచే జయింపఁబడి యీరీతిగా ననేక దుష్టకర్మలనుచేసిరి. ఇట్లు దుర్మార్గులచే పీడింపఁబడియు నాతఁడు అపాయమును బొందనివాఁడాయెను.

శ్లో॥ పాపాత్మభిఃకృతంకర్మ నిష్ఫలంయాతిదుష్టవత్ ॥

తా॥ పాపులచే చేయఁబడు కర్మము దుర్బుద్ధిగల మనుజునివలె ఫలములేనిదికనుక నాచిన్నవానికపాయము కలుగకపోయెను.

శ్లో॥ తదంబాంకౌముదీనామ్నీం నిత్యంహేళనపూర్వకం।
రండాచపలటాలజ్జాహీనాసాగతసాధ్వసా ।
ఊన్నమయ్యముఖంలోకే కథంసంచరతీత్యహో।
వదంతిలోకాస్తత్రస్థాః పామరాఃకూరవృత్తయః॥

తా॥ ఇట్లుండఁగా నాపట్టణమునందు దుష్టవృత్తిగల జ్ఞానము లేని జనులు ఆచిన్నవాని తల్లికి నొకయపవాదును వేయఁగలవారని యిది వెనిమిటి చనిపోయినతర్వాత గర్భముచేసికొనినది. రండలాఁడి, సిగ్గును విడిచి భయము లేనట్టి లోకమునందు తలయెత్తుకొని తిరుగుచున్నది. ఎంత ఆశ్చర్యము అని పలుకుచుండిరి.

శ్లో॥ అయంసమాత్రోబలవాన్ విద్యావాన్గుణవాన్ ఖలు।
చతుష్షష్టికళాదక్షో వాణిజ్యేచాతిబుద్ధిమాన్॥

తా॥ ఈచిన్నవాఁడు బలవంతుఁడును,విద్యగలవాఁడును,గుణము గలవాఁడును, అఱువదినాలుగు విద్యలయందు సమర్థుఁడును, వర్తక మందు నేర్పుగలవాఁడునై యుండెను.

శ్లో॥ పరీవాదస్తస్యలోకే బలవాన్జాయతేఽస్యవత్ ।
కథంనివృత్తిస్తస్యస్యా దిత్యాలోచ్యచపండితైః।
తాంస్తాన్గ్రామస్థితాన్సర్వాన్ సమాహూయసభాకృతా॥

తా॥ ఇట్లుండ యిదియేమి, లోకమందు పామరునికి బోలె పండితుండయిన యాచిన్నవానికి అపకీర్తి బలమగుచున్నది. ఈయప కీర్తి యెట్లు నశించునని యాలోచించి గ్రామమందుండు జనులను పిలిపించి పండితులు సభచేసిరి.

శ్లో॥ తస్యాంసభాయాంకేచిత్తు కౌముదీగుణశాలినీ।
తస్యామేవాపవాదోఽయంజాయతేజనసంసది॥

తా॥ అట్లు సభనుచేయఁగా నాసభయందు కొందఱు యా కౌముదియనుచిన్నది మిక్కిలి గుణవంతురాలు. అట్టి గుణవంతురాల యిన యామె కపకీర్తి జనులయందు పుట్టినది.

శ్లో॥ దైవానుగ్రహమాత్రేణ సుతోత్పత్తిర్భవిష్యతి।
మాతుర్భీమకవేర్నార్యాః పుత్రోత్పత్తిశ్చనశ్రుతా॥

తా॥ దైవానుగ్రహముచేత పుత్రులు కలుగుట లోకమందు కలదు. దానికి దృష్టాంతమేమనిన, భీమకవియనువానితల్లికి యాకవి కలిగిన వార్త మీరుచే వినఁబడలేదా.

శ్లో॥ కోలాహలస్యపత్న్యాంతు పుత్రోఽభూత్ జ్ఞానవాన్శివాత్ ।
తతస్సోపిధనవాన్ జాతః ప్రసాదాచ్ఛూలపాణినః॥

తా॥ కోలాహలుఁడను వానిభార్యయందు శివానుగ్రహము వలన జ్ఞానముగల పుత్రుఁడొకఁడు కలిగెను. తరువాతవాఁడు శివుని యను గ్రహమువలన విభవయుతుఁడు కలిగెను.

శ్లో॥ తస్మాదస్మాదృశాస్త్రీహ్యః కథంవదతిభోజనాః ।
ఇత్యాహుఃపరభీతేన మనసాతత్రసంస్థితాః॥

తా॥ కావున నోజనులారా! ఆమెయందుదపవాద మెట్లుండునో చెప్పుఁడీయని పరలోకభయముగల మనస్సుతో నా సభయందుండు జనులు పలికిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వానిర్ఘృణో నామ సభాయాంకశ్చిదుత్థితః ।
ధర్మాత్మానస్సత్యపరా యూయంపరమనిందకాః।
ఈర్ష్యాసూయావిహీనాశ్చ పరోపకృతిశాలినః॥

తా॥ అట్లు కొందరు చెప్పిన వాక్యమును నిర్ఘృణుఁడనువాఁడు విని సభయందు లేచినవాఁడై మీరందఱు ధర్మాత్ములు, సత్యవాదులు, కోపములేనివారు, పరులమేలును సహించువారు, పరుల కుపకారము చేయువారు.

శ్లో॥ తథాన్వహందురాత్మాచ నిందకశ్చపరవంచకః ।
యమలోకస్యసంచారో మమహాస్తిభవతాంనవా॥

తా॥ మీరలటువంటివారలగుదురుగాక. నేను దుష్టుఁడను. పరులను నిందించువాఁడను. వంచనసేయువాఁడను. యముని లోకమందు సంచారముచేయువాఁడను. మీరట్టివారుకారు.

శ్లో॥ ఏషావేశ్యాసమాపృత్యా దుర్భగాదుష్టచారిణీ।
సర్వదాకౌముదీత్యాజ్యా సందేహోనాస్తిభోజనాః॥

తా॥ ఈ కౌముదియను చిన్నది నడవడికచేత వేశ్యతో సమానమైనది. దౌర్భాగ్యురాలు. దుష్టసంచారముగలది ఓజనులారా! ఏవిధమున నయినను నీమె విడువఁదగినది. సందేహములేదు.

శ్లో॥ తస్మాన్మోచ్చారణానర్హా తయాకింపాపచేతసా ।

ఇత్యాదీన్యసభామధ్యే శేషాంశ్చిన్త్య నిర్ఘృణః।
మంత్రయిత్వాతదాతాంస్తాన్ సంక్షిప్య త్వావతిష్ఠతే॥

తా॥ దీని నామముకూడ తలంపఁగూడదు. పాపబుద్ధిగల దానితో మాకేమి అని పలికి సభామధ్యమందు కొందరితో నాలోచించి యప్పుడు కొంతమందిని తనపక్షము చేర్చుకొనియుండెను.

శ్లో॥ ఏవంతిష్ఠంతివై శ్యేచ నిర్ఘృణోనామ కేతులే।
తద్భార్యాశీలసంపన్నా కమలాక్షీతిపిశ్రుతా।
తాందృష్ట్వాగృహమధ్యేతు దాసీభ్రాంతిమవాపసః॥

తా॥ ఈరీతిగ దుష్టుఁడయిన నిర్ఘృణుఁడను కోమటి కక్ష నవలంబించియుండఁగ పాతివ్రత్య స్వభావముగల కమలాక్షియను పేరుగల తనభార్యను తనగృహమందు చూచినవాఁడై యాకోమటి దాసియను భ్రాంతికలవాఁడాయెను.

శ్లో॥ కిమిదంగృహమధ్యస్థా కథయామానదుర్భగే।
ఇత్యుక్త్వాతచ్ఛిఖాంగృహ్య న్పాదేనాతాడయత్తదా॥

తా॥ అట్లు భ్రాంతికలవాఁడై యిదియేమి, ఓ దౌర్భాగ్యురాలా! ఏల గృహమధ్యమందుంటివి చెప్పుమని దానికొప్పును పట్టుకొని కాలితో తన్నెను.

శ్లో॥ తందృష్ట్వాపాణినాథంసా ద్వారికభ్రమసంయుతా।
హస్తన ర్త్యంకుశేనాశు తాడయామాసలంముహుః॥

తా॥ ఆ సద్వృత్తిగల భార్యయు పెనిమిటినిజూచిద్వారమందు కావలియుండువాడను భ్రాంతికలదై హస్తమందుండు నంకుశముతో నతనిని వేగముతో కొట్టినది.

శ్లో॥ కాత్వంనీచకులేజాతా మద్గేహంతఃప్రవిశ్యసి।
ద్వారికాధమత్వంకో మాంతాడయసినిష్ఠురమ్॥

తా॥ నీ వెవతెవే నీచకులమందుపుట్టి నాగృహములోనికి ప్రవేశించితివని నిర్ఘృణుఁడనఁగా నతనిభార్య ద్వారపాలకులలో నధముఁడవయిన నీవెవ్వఁడవు నన్ను కఠినముగా కొట్టెదవని పలికెను.

శ్లో॥ ఇత్యూచమానౌతౌదృష్ట్వా వీథ్యాంవీథ్యాంప్రవిశ్యచ।
హస్తాభ్యాంపాదయుగ్మేన తాడయామాసతుర్భృశమ్॥

తా॥ ఈరీతిని ఒకరికొకరు పౌరుష్యముతో పలుకుకొనుచు ప్రతివీథియందు ప్రవేశించి చేతులతోడను కాళ్లతోడను మిక్కిలి కొట్టుకొనిరి.

శ్లో॥ రండేతిరండాపుత్రేతి వాగ్వ్యాపారంచకుర్వతౌ।
కేశాకర్షణసంరంభౌ ముష్టిఘాతసమన్వితౌ॥
దండప్రహారణౌకుద్ధౌ నఖఘాతైశ్చరంజితౌ।
పరస్పరమజానంతౌ దంపతీదృష్టవాన్జనః॥

తా॥ అట్లు కొట్టుకొనుచు రండ రండాపుత్రియను వాక్కులను పలుకుచు జుట్టుపట్టుకొని యీడ్చుకొనుచు, పిడికి గుద్దులు గుద్దుకొనుచు కఱ్ఱలతో కొట్టుకొనుచు గోళ్లతో గిచ్చుకొనుచు కోపము గలవారై యొకరినొకరు తెలిసికొనలేక తిఱుగుచున్న దంపతులను గ్రామమందుండు జనులు చూచిరి.

శ్లో॥ కిమిదంమహదాశ్చర్యం హేతునాకేనచాభవత్ ।
కలావతీమహాసాధ్వీ కమలాక్షీ పతిప్రియా॥

తా॥ అట్లు చూచి యిదియేమి గొప్పయాశ్చర్యము! ఏ హేతువువల్ల కలిగినది. కలియుగమందీ కమలాక్షియనునది బహుబుద్ధిగలదై పతివ్రతయై పెనిమిటియందతిప్రేమ కలిగియున్నది.

శ్లో॥ నిర్గుణఃక్రూరచిత్తోఽపి కీర్తిమాన్లోకవిశ్రుతః।
ఏతయోఃప్రాక్కృతంకర్మ చేత్థంఫలతినాన్యథా॥

తా॥ నిర్గుణుఁడనువాడు కఠినమనస్సు కలవాడయినను గొప్పకీర్తిగలవాడై, లోకమందతిప్రసిద్ధుఁడై యుండెను. వీరిద్దఱికిట్లు సంభవించవలసినదికాదు. వీరిద్దఱకు పూర్వజన్మార్జిత దుష్కర్మమిట్లు పరిణమించినది. మఱియొక కారణమేమియు లేదు.

శ్లో॥ ఇత్యాలోచ్యజనాస్సర్వే పూర్వోద్యుక్తస్యచేష్టితం।
కౌముదీవిషయేక్రూర వాక్యంస్మృత్వాతతఃపరమ్॥

తా॥ సర్వజనులిట్లు నాలోచించి పూర్వదినమున జన్మించిన కౌముదీ యను చిన్నదానినిపిలిపించి పలికిన పలికినవాక్యమును తలఁచి పిమ్మట,

శ్లో॥ ఆహూయకౌముదీంపుత్ర విషయంవాక్యమబ్రువన్ ।
మాతఃకథయపుత్రస్య వృత్తాంతంజనసంసది॥

తా॥ కౌముదియను నామెను పిలిపించి పుత్రునిగూర్చి యొకానొక ప్రశ్న చేసిరి. అది యేమనిన, నీమహాజన సభయందు ఓతల్లీ! నీకుమారునిగూర్చి వాస్తవమైన వృత్తాంతమును జెప్పుమనిరి.

శ్లో॥ యథార్థంవదని శ్శేషం నభీఃకార్యాత్వయానఘే ।
ఇత్యుక్త్వాసామహాసాధ్వీ వక్తుమారభ తేతదా॥

తా॥ నీకేమియు భయములేదు. సత్యముగా వృత్తాంతమంతయు చెప్పుమని యాపతివ్రత సభయందడుగబడినదై అప్పుడు చెప్పుటకు ప్రారంభించెను.

శ్లో॥ బ్రాహ్మణ్యాఃపరిహాసార్థం వాక్యంశ్రుత్వాఽహమబ్రువం ।
మమాశుపుత్రోహే సత్యనారాయణమహాప్రభో।
పశ్చాద్వ్రతంకరిష్యామీ త్యుక్త్వాతూష్ణీంవసామ్యహమ్॥

తా॥ ఓ మహామహులారా ! నేనొకానొక బ్రాహ్మణ స్త్రీ యొక్క పరిహాసవాక్యమును విని యీదిగువరీతిగా పలికితిని. ఓసత్యనారాయణమూర్తీ! మహానుభావా ! నాకు కుమారుఁడు కలిగినటులయిన పిమ్మట నీవ్రతము తప్పక చేసెదనని పరిహాసముగ పలికి యూరకుంటిని.

శ్లో॥ తావన్మాత్రేణసత్యస్య ప్రసాదాద్గర్భిణీసతీ।
తత్కాలేమరణోపాయా బహువారంమయాకృతాః॥

తా॥ అంతమాత్రముననే సత్యనారాయణానుగ్రహము గలిగి గర్భవంతురాలైతిని. అట్టికాలమందు నాచేత ననేకమార్లు మరణోపాయములు చేయఁబడినవి.

శ్లో॥ తేసర్వేమరణోపాయా స్తేనదేవేనవారితాః ।
తతఃపరంమనఃకృత్వా శిలారూపంవసామ్యహమ్॥

తా॥ అట్లు నాచే చేయఁబడిన మరణోపాయముల నన్నింటిని

ఆసత్యదేవుఁడు విఘ్నములచే వినాశించెను. అటుపిమ్మట మనస్సును
రాయిచేసికొనియుంటిని.

శ్లో॥ కుమారోదయమారభ్య భవద్భిజ్ఞాతయతేఽఖిలం।
ఏతస్మాదన్యవృత్తాంతం నజానామిసభాసదః॥

తా॥ పిమ్మట పుత్రోత్పత్తి కలిగినది మొదలు జఱిగినవ్యాపా
రము మీకు విశదమేకదా. ఇంతకుతప్ప మఱియొక వ్యాపారమును
నేనెఱుఁగను ఓసభ్యులారాయని విన్నవించెను.

శ్లో॥ ఇత్యుక్త్వావిరరామాసా వాక్యంవాక్యవిచక్షణాః।
శ్రుత్వాతుకౌముదీవాక్యం పరంవిశ్వాసమాయయుః॥

తా॥ పలుకుటయందు నేర్పుగల యాకౌముదియను చిన్నది
యీరీతిని వాక్యమును వచించి విరమించెను. సభాజనులు కౌముదీ
వాక్యమునువిని మిక్కిలి నమ్మికగలవారైరి.

శ్లో॥ కమలాక్షీనిర్గుణశ్చ దంపతీప్రకృతింగతౌ।
ఇదానీమేవతాభ్యాం చేత్కారయిష్యామహేవ్రతమ్॥

తా॥ ఈకమలాక్షియు నిర్గుణుఁడను దంపతులు పూర్వస్థితిని పొం
దినయెడల నిప్పుడే వారిచే సత్యనారాయణవ్రతము చేయింపగలము.

శ్లో॥ ఇత్యుదీర్యజనాస్సర్వే పశ్యంతోదుష్టదంపతీ।
జ్ఞాత్వాఽజ్ఞానాత్కృతం కర్మశిరోనత్వాఽపతుర్గృహమ్॥

తా॥ ఇట్లు పలికి జనులందరు చూచుచుండఁగా దుష్టస్వభావ
ముగల యాదంపతులీ కృత్యమును తెలియక చేసినదానిని తెలిసికొని
తలవంచుకొని సిగ్గుచే గృహము ప్రవేశించిరి.

శ్లో॥ సంఘీభూయజనాస్సర్వే నిర్గుణంచేదమబ్రువన్।
వ్రతంసత్యస్య దేవస్య కురుశీఘ్రమతంద్రితః॥

తా॥ పిమ్మట జనులందఱు గుమికూడి ఓనిర్గుణుఁడా! తొందర
లేనివాడవై త్వరగాసత్యనారాయణదేవునివ్రతమును జేయుమనిపలికిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వాజనవాక్యంతు తదాచక్రేవ్రతోత్తమం।
కౌముదీధైర్యమాపన్నా వ్రతంకర్తుంసముద్యతా॥

తా॥ నిర్గుణుఁడనువాడు జనులయొక్క వాక్యమునువినిఅప్పుడు

శ్రేష్ఠమయిన సత్యనారాయణ వ్రతమును జేసెను. కౌముదియు నప వాదముతప్పునది గదాయని ధైర్యముగలదై సత్యనారాయణ వ్రత మును జేయుటకు ప్రయత్నముగలదాయెను.

శ్లో॥ సర్వాన్బంధూన్సమాహూయ వ్రతమాచరితంత్వయా।
వ్రతావసానేకేచిత్తు ప్రసాదగ్రహణంకథం।
ఇతిసందిహ్యతత్రస్థా నోచుర్భయసమన్వితాః॥

తా॥ సమస్త బంధువులనుపిలచి ఆకౌముదియను చిన్నదానిచే వ్రతముచేయఁబడినది. అట్లు వ్రతము జరిగిన తర్వాత కొందఱు ప్రసాదమును గ్రహించుట యెట్లు అని సందేహము కలిగి యింతకు ముందు జరిగిన నిర్గుణుని వ్యాపారమువల్ల కలిగిన సందేహమును భయముచే వెల్లడిచేయక యూరకుండిరి.

శ్లో॥ తతాంతరేతిగంభీరం వాక్యంగగనమండలాత్ ।
కౌముద్యాయద్యదుక్తం హితత్తత్సత్యంనసంశయః।
విశ్వాసంయస్యమనసి నాస్తితత్సర్వసంపదః।
హరిష్యేఽత్రనసందేహ ఇత్యశ్రావిమహాద్భుతమ్॥

తా॥ ఇట్లుండఁగా నాకాశమునుండి కౌముదియనుచిన్నదానిచే నేది చెప్పఁబడినదో యదియంతయు నిజము, సంశయములేదు. ఎవని మనస్సున నమ్మకము లేకుండునో వాని సమస్త సంపత్తుల నపహరిం చెదను. ఈ విషయమందు సందేహములేదని మిక్కిలి ఆశ్చర్య ముగా వినఁబడినది.

శ్లో॥ తచ్ఛ్రుత్వాసకలాంవాణీం జనాస్సంతోషమాయయుః।
నిర్గుణోనామవైశ్యోఽపి పరాంప్రీతిమవాపసః॥

తా॥ ఆ యాకాశవాణియొక్క వాక్యమును సంపూర్ణముగా విని సభాజనులు సంతోషమును బొందిరి. ఈనిర్గుణుఁడును కోమటి యు మిక్కిలి ప్రేమను బొందెను.

శ్లో॥ కౌముదీసూనవేస్వస్య సుతాంప్రీత్యాచదత్తవాన్।
స్నుషాపుత్రిసమాయుక్తా కౌముదీవిరరాజసా॥

తా॥ ఆ నిర్గుణుఁడనువాఁడు కౌముదియొక్క కుమారునికి తన

పుత్రికను సంతోషముతోనిచ్చి వివాహముచేసెను. కౌముదియను కోమటిచిన్నది కోడలితోను కుమారునితోను కూడి మిక్కిలి ప్రకాశించుచుండెను.

శ్లో॥ బుభోజసర్వభోగాంశ్చాఽ వసానేహరిమందిరం ।
పాప్యైకల్పముషిత్వాచ తతఃకైలాసమన్వగాత్ ॥

తా॥ పిమ్మట భూలోకమందే సమస్తభోగముల ననుభవించి దేహాంతమందు వైకుంఠమునుజేరి యొక కల్పకాలముండి యంతట కైలాసమును బొందెను.

శ్లో॥ తత్రస్థిత్వాకల్పమేకం జగామబ్రహ్మణఃపదం ।
తత్రానుభూయతద్భోగాన్ విముక్తింయాతిబ్రహ్మణా॥

తా॥ ఆ కైలాసమందు ఒక కల్పముండి బ్రహ్మలోకము వచ్చి చేరెను. ఆబ్రహ్మలోకమందు కొంత తడవు భోగముల ననుభవించి బ్రహ్మతోగూడ ముక్తిని బొందెను.

శ్లో॥ యఇదంశ్రుణుయాన్నిత్యం భక్తియుక్తేనచేతసా।
ఇహలోకేసుఖంభుక్త్వా హ్యాంతేస్వర్గమవాప్నుయాత్ ॥

తా॥ ఈ కథను యెవరు భక్తిగల చిత్తముతో వినునోవారు యీ లోకమందు సుఖముల ననుభవించి దేహాంతమందు స్వర్గమును జేరుదురు.

శ్లో॥ యేమూఢోనిందతేఽధ్యాయ మిమంలోకేషువిశ్రుతం।
స్వర్గలోకస్థితాస్తస్య పూర్వేనారకినోఽభవన్॥

తా॥ మూఢుఁడయిన యెవఁడు లోకమందు ప్రసిద్ధమయిన యీయధ్యాయమును నిందచేయునో వాని యొక్క స్వర్గమందున్న పూర్వులందఱు నరకమునుఁ బొందెదరు.

ఇతి నవమోధ్యాయ స్సమాప్తః.

---

ఇతి శ్రీస్కాందపురాణే రేవాఖండే సూత శౌనక సంవాదే
సత్యనారాయణ వ్రతకల్ప స్సమాప్తః.

## —♦ నవగ్రహ స్తోత్రమ్. ♦—

శ్లో॥ భాస్వాన్ కాశ్యపగోత్రజోఽరుణరుచిర్యస్సింహపోఽర్కస్సమిః।
త్షట్త్రిస్థోదశశోభనో గురుశశీ భౌమాస్సుమిత్రాస్సదా।
శుక్రోమందరిపుః కళింగ జనపశ్చాగ్నీశ్వరో దేవతా।
మధ్యేవర్తులపూర్వదిగ్దినకరః కుర్యాత్సదామంగళమ్॥ ౧

శ్లో॥ చంద్రఃకర్కటకప్రభుస్సితసిభ శ్చాత్రేయగోత్రోద్భవ।
శ్చాత్రేయశ్చతురశ్రవారుణముఖ శ్చాపేఉమాధీశ్వరః।
షట్సప్తాగ్నిదశైకశోభనఫలో నోరిస్సుధార్కప్రియః।
స్వామీయామునదేశ పర్ణసమిధః కుర్యాత్సదామంగళమ్॥ ౨

శ్లో॥ భౌమోదక్షిణదిక్త్రికోణయమది గ్వింధ్యేశ్వరఃఖాదిరః।
స్వామీవృశ్చికమేషయోస్సురగురు శ్చార్కశ్శశీసౌహృదః।
జ్ఞోఽరిష్టత్రిఫలప్రదశ్చ వసుధాస్కందఃక్రమాద్దేవతా।
భారద్వాజకులోద్వహోఽరుణరుచిః కుర్యాద్సదామంగళమ్॥ ౩

శ్లో॥ సౌమ్యఃపీతఉదఙ్ముఖస్సమిదపా మార్గోఽత్రిగోత్రోద్భవో।
బాణేశానదిశస్సుహృద్రవిసుత శ్శేషాస్సమాశ్శీతగోః।
కన్యాయుగ్మపతిర్దశాష్ట చతురష్షణ్ణేత్రగశ్శోభనో।
విష్ణుర్దైవ్యధిదేవతేమగధపః కుర్యాత్సదామంగళమ్॥ ౪

శ్లో॥ జీవశ్చాంగిరగోత్రజోత్తరముఖో దీర్ఘోత్తరాశాస్థితః।
పీతోఽశ్వత్థసమిచ్చసింధుజనిత శ్చాపోఽథమీనాధిపః।
సూర్యేందుక్షితిజాఃప్రియా బుధసితౌశత్రూసమాశ్చాపరే।
సప్తద్వేనవపంచమే శుభకరః కుర్యాత్సదామంగళమ్॥ ౫

శ్లో॥ శుక్రోభార్గవగోత్రజస్సితసభః పూర్వాముఖఃపూర్వదిక్।
పాంచాలస్థవృషస్తులాధిప మహారాష్ట్రాధిపౌదుంబరః।

ఇంద్రాణీమఘవాచలాంఛన శనిర్మిత్రార్కచంద్రావరీ।
షష్ఠత్రిర్దశవర్జితేభృగుసుతః కుర్యాత్సదామంగళమ్॥

శ్లో॥ మందః కృష్ణనిభః సపశ్చిమముఖః సౌరాష్ట్రపః కాశ్యపే।
నక్రకుంభపమిత్రసౌమ్యనగరే వక్రేందుయామారయః।
స్థానంపశ్చిమదిక్ప్రజాపతి యమౌదేవౌధనుష్యాసనౌ।
షట్త్రిస్థశ్శుభకృత్శయా రవిసుతః కుర్యాత్సదామంగళమ్॥

శ్లో॥ రాహుస్సింహళదేశపోనిర్ ఋతిః కృష్ణాంగశూర్పాసనః।
యఃపైఠీనసగోత్రసంభవ సమిద్దూర్వాముఖో దక్షిణః।
యస్సర్పోప్యధిదేవతా నిర్ ఋతిః ప్రత్యాధిదేవస్సదా।
షట్త్రిస్థశ్శుభకృచ్చసింహగసుతః కుర్యాత్సదామంగళమ్॥

శ్లో॥ కేతుర్జైమినిగోత్రజః కుశసమిద్వాయవ్యకోణేస్థితః।
చిత్రాంకధ్వజలాంఛనోహి భగవాన్యోదక్షిణాశాముఖః।
బ్రహ్మాచైవతుచిత్రగుప్తప్రముఖః ప్రత్యాధిదేవస్సదా।
షట్త్రిస్థశ్శుభకృచ్చ బర్బరపతిః కుర్యాత్సదామంగళమ్॥

నవగ్రహస్తోత్రం సమాప్తమ్.

# భగవత్స్తుతిః



శ్లో॥ వాత్సల్యాదభయప్రదాన సమయాదార్తార్తినిర్వాపణా ।
దౌదార్యాదఘశోషణాదగణిత శ్రేయఃపదప్రాపణాత్ ।
సేవ్యశ్శ్రీపతిరేకఏవ జగతామేతేచ షట్సాక్షిణః ।
ప్రహ్లాదశ్చ విభీషణశ్చ కరిరాట్పాంచాల్యహల్యాధ్రువః॥

శ్లో॥ ప్రహ్లాదాస్తియదీశ్వరోవద హరిస్సర్వత్రమేదర్శయ ।
స్తంభేచైవమితి బ్రువన్తమధతం తత్రావిరాసీద్ధరిః ।
వక్షస్తస్యవిదారయన్నఖముఖై ర్వాత్సల్యమావేదయ ।
న్నార్తత్రాణపరాయణస్స భగవన్నారాయణో మేగతిః ॥

శ్లో॥ శ్రీరామాత్రవిభీషణో యమనఘోరక్షోభయాదాతుర ।
స్సుగ్రీవానయపాలయేమ మధునాపౌలస్త్యమేవాగతమ్।
ఇత్యుక్త్వాఽభయమస్య సర్వవిదితో యోరాఘవో।
దత్తవానార్తత్రాణసరాయణస్స భగవన్నారాయణో మేగతిః॥

శ్లో॥ నక్రగ్రస్తపదంసముద్ధృతకరం బ్రహ్మాదిదేవాస్సురాః।
పాల్యన్తామితిదీనవాక్యకరుణై ర్దేవైరశక్తైస్స్వయమ్।
మాభైష్టీతిగిరాఽఽవిరాస భగవాంశ్చక్రాయుధశ్శ్రీధరః।
ఆర్తత్రాణపరాయణస్స భగవాన్నారాయణో మేగతిః॥

శ్లో॥ హేకృష్ణాచ్యుత హేకృపాజలనిధే హేపాండవానాంసఖే।
క్వాసిక్వాసిసుయోధనాదపహృతాంభో రక్షమామాకులాం।
ఇత్యుక్తోఽక్షయవస్త్రసమ్భృత తనుం యోఽపాలయద్ద్రౌపదీ।
మార్తత్రాణపరాయణస్స భగవన్నారాయణో మేగతిః॥

శ్లో॥ యత్పాదాబ్జనఖోదకం త్రిజగతాం పాపౌఘవిధ్వంసనం।
యన్నామామృతపూరకంచ పిబతాం సంసారసన్తారకం।
పాషాణోఽపి యదఙ్ఘ్రిపద్మరజసా శాపాన్మునేర్మోచితః।
ఆర్తత్రాణపరాయణస్స భగవన్నారాయణో మేగతిః॥

శ్లో॥ ప్రితాఖ్యాత్రితరముత్తమస్థానసగతం భక్తోత్తమశ్చధ్రువో।
దృష్ట్వాతత్సమమారురుక్షురనఘోమాత్రాఽవమానంగతః।
యం దృష్ట్వాశరణంహ్యావాపతపసా హేమాద్రిసింహాసనం।
ఆర్తత్రాణపరాయణస్స భగవన్నారాయణో మేగతిః॥

భగవత్ స్తుతి స్సమాప్తా,

---

## —♦ నవగ్రహ ప్రార్థనా ♦—

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ।
గురు శుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవేనమః॥




ఇతి నవగ్రహప్రార్థనం కుర్యాత్॥

# శ్రీ విష్ణు సహస్రనామావళిః.

ఆద్యంతయోః ప్రణవోచ్చారణం కేచిత్కుర్వంతి.

ఓం విశ్వస్మైనమః
విష్ణవేనమః
వషట్కారాయనమః
భూతభవ్యభవత్ప్రభవేనమః
భూతకృతేనమః
భూతభృతేనమః
భావాయనమః
భూతాత్మనేనమః
భూతభావనాయనమః
పూతాత్మనేనమః ౧౦
ఓం పరమాత్మనేనమః
ముక్తానాంపరమాగతయేనమః
అవ్యయాయనమః
పురుషాయనమః
సాక్షిణేనమః
క్షేత్రజ్ఞాయనమః
అక్షరాయనమః
యోగాయనమః
యోగవిదాంనేత్రేనమః
ప్రధానపురుషేశ్వరాయనమః
ఓం నారసింహవపుషేనమః ౨౦
శ్రీమతేనమః
కేశవాయనమః
పురుషోత్తమాయనమః

ఓం సర్వస్మైనమః
శర్వాయనమః
శివాయనమః
స్థాణవేనమః
భూతాదినిధయేనమః
అవ్యయాయనమః ౩౦
ఓం సంభవాయనమః
భవనాయనమః
భర్త్రేనమః
ప్రభవాయనమః
ప్రభవేనమః
ఈశ్వరాయనమః
స్వయమ్భువేనమః
శమ్భవేనమః
ఆదిత్యాయనమః
పుష్కరాక్షాయనమః ౪౦
ఓం మహాస్వనాయనమః
అనాదినిధనాయనమః
ధాత్రేనమః
విధాత్రేనమః
ధాతురుత్తమాయనమః
అప్రమేయాయనమః
హృషీకేశాయనమః
పద్మనాభాయనమః

అమరప్రభవేనమః
విశ్వకర్మణేనమః ౫౦
ఓం మనవేనమః
త్వష్ట్రేనమః
స్థవిష్ఠాయనమః
స్థవిరాయనమః
ధ్రువాయనమః
అగ్రాహ్యాయనమః
శాశ్వతాయనమః
కృష్ణాయనమః
లోహితాక్షాయనమః
ప్రతర్దనాయనమః
ఓం ప్రభూతాయనమః
త్రికకుద్ధా (ద్దా) మ్నేనమః
పవిత్రాయనమః
మంగళాయపరస్మైనమః
ఈశానాయనమః
ప్రాణదాయనమః
ప్రాణాయనమః
జ్యేష్ఠాయనమః
శ్రేష్ఠాయనమః
ప్రజాపతయేనమః ౭౦
ఓం హిరణ్యగర్భాయనమః
భూగర్భాయనమః
మాధవాయనమః
మధుసూదనాయనమః
ఈశ్వరాయనమః
విక్రమిణేనమః
ధన్వినేనమః
మేధావినేనమః
విక్రమాయనమః
క్రమాయనమః ౮౦
ఓం అనుత్తమాయనమః
దురాధర్షాయనమః
కృతజ్ఞాయనమః
కృతయేనమః
ఆత్మవతేనమః
సురేశాయనమః
శరణాయనమః
శర్మణేనమః
విశ్వరేతసేనమః
ప్రజాభవాయనమః ౯౦
ఓం అహ్నేనమః
సంవత్సరాయనమః
వ్యాళాయనమః
ప్రత్యయాయనమః
సర్వదర్శనాయనమః
అజాయనమః
సర్వేశ్వరాయనమః
సిద్ధాయనమః
సిద్ధయేనమః
సర్వాదయేనమః ౧౦౦
ఓం అచ్యుతాయనమః
వృషాకపయేనమః
అమేయాత్మనేనమః
సర్వయోగవినిస్సృతాయనమః

ఓంవసవే నమః
వసుమనసే
సత్యాయ
సమాత్మనే
సమ్మితాయ
సమాయ ౧౧౦
అమోఘాయ నమః
పుణ్డరీకాక్షాయ
వృషకర్మణే
వృషాకృతయే
రుద్రాయ
ఓం బహుశిరసే
బభ్రవే
విశ్వయోనయే
శుచిశ్రవసే
అమృతాయ ౧౨౦
శాశ్వతాయ
స్థాణవే
వరారోహాయ
మహాతపసే
సర్వగాయ
సర్వవిదే
భానవే
విష్వక్సేనాయ
జనార్దనాయ
వేదాయ ౧౩౦
వేదవిదే
అవ్యఙ్గాయ

ఓం వేదాఙ్గాయ నమః
వేదవిదే
కవయే
లోకాధ్యక్షాయ
సురాధ్యక్షాయ
ధర్మాధ్యక్షాయ
కృతాకృతాయ
చతురాత్మనే ౧౪౦
చతుర్వ్యూహాయ
చతుర్దంష్ట్రాయ
చతుర్భుజాయ
భ్రాజిష్ణవే
భోజనాయ
భోక్త్రే
సహిష్ణవే
జగదాదిజాయ
అనఘాయ
విజయాయ ౧౫౦
జేత్రేనమః
విశ్వయోనయే
పునర్వసవే
ఉపేన్ద్రాయ
వామనాయ
ప్రాంశవేనమః
అమోఘాయ
శుచయేనమః
ఊర్జితాయనమః
అతీన్ద్రాయనమః ౧౬౦

ఓం సంగ్రహాయ నమః
సర్గాయ నమః
ధృతాత్మనే నమః
నియమాయ నమః
యమాయ నమః
వేద్యాయ నమః
వైద్యాయ నమః
సదాయోగినే నమః
వీరఘ్నాయ నమః
మాధవాయ నమః ౧౭౦
మధవే నమః
అతీన్ద్రియాయ నమః
మహామాయాయ నమః
మహోత్సాహాయ నమః
మహాబలాయ నమః
మహాబుద్ధయే నమః
మహావీర్యాయ నమః
మహాశక్తయే నమః
మహాద్యుతయే నమః
అనిర్దేశ్యవపుషే నమః ౧౮౦
శ్రీమతే నమః
అమేయాత్మనే నమః
మహాద్రిధృతే నమః
మహేష్వాసాయ నమః
మహీభర్త్రే నమః
శ్రీనివాసాయ నమః
సతాంగతయే నమః
అనిరుద్ధాయ నమః

ఓం సురానన్దాయ నమః
గోవిన్దాయ నమః ౧౯౦
గోవిదాంపతయే నమః
మరీచయే నమః
దమనాయ నమః
హంసాయ నమః
సుపర్ణాయ నమః
భుజగోత్తమాయ నమః
హిరణ్యనాభాయ నమః
సుతపసే నమః
పద్మనాభాయ నమః
ప్రజాపతయే నమః ౨౦౦
అమృత్యవే నమః
సర్వదృశే నమః
సింహాయ నమః
సన్ధాత్రే నమః
సన్ధిమతే నమః
స్థిరాయ నమః
అజాయ నమః
దుర్మర్షణాయ నమః
శాస్త్రే నమః
విశ్రుతాత్మనే నమః ౨౧౦
సురారిఘ్నాయ నమః
గురుతమాయగురవే నమః
ధామ్నే నమః
సత్యాయ నమః
సత్యపరాక్రమాయ నమః
నిమిషాయ నమః

ఓం అనిమిషాయనమః
స్రగ్విణేనమః
వాచస్పతయేనమః
ఉదారధియేనమః ౨౨౦
అగ్రణ్యేనమః
గ్రామణ్యేనమః
శ్రీమతేనమః
న్యాయాయనమః
నేత్రేనమః
సమీరణాయనమః
సహస్రమూర్ధ్నేనమః
విశ్వాత్మనేనమః
సహస్రాక్షాయనమః
సహస్రపదేనమః ౨౩౦
ఆవర్తనాయనమః
నివృత్తాత్మనేనమః
సంవృతాయనమః
సంప్రమర్దనాయనమః
అహస్సంవర్తకాయనమః
వహ్నయేనమః
అనిలాయనమః
ధరణీధరాయనమః
సుప్రసాదాయనమః
ప్రసన్నాత్మనేనమః ౨౪౦
విశ్వసృజేనమః
విశ్వభుజేనమః
సత్కర్త్రేనమః
సత్కృతాయనమః

ఓం సాధవేనమః
జహ్నవేనమః
నారాయణాయనమః
నరాయనమః
అసంఖ్యేయాయనమః
అప్రమేయాత్మనేనమః ౨౫౦
విశిష్టాయనమః
శిష్టకృతేనమః
శుచయేనమః
సిద్ధార్థాయనమః
సిద్ధసంకల్పాయనమః
సిద్ధిదాయనమః
సిద్ధిసాధనాయనమః
వృషాహిణేనమః
వృషభాయనమః
విష్ణవేనమః ౨౬౦
వృషపర్వణేనమః
వృషోదరాయనమః
వర్ధనాయనమః
వర్ధమానాయనమః
వివిక్తాయనమః
శ్రుతిసాగరాయనమః
సుభుజాయనమః
దుర్ధరాయనమః
వాగ్మిణేనమః
మహేంద్రాయనమః ౨౭౦
వసుదాయనమః
వసవేనమః

ఓం నైకరూపాయనమః
బృహద్రూపాయనమః
శిపివిష్టాయనమః
ప్రకాశాయనమః
ఓజస్తేజోద్యుతిధరాయ
ప్రకాశాత్మనేనమః
ప్రతాపనాయనమః
బుద్ధాయనమః ౨౭౦
స్పష్టాక్షరాయనమః
మన్త్రాయనమః
చన్ద్రాంశవేనమః
భాస్కరద్యుతయేనమః
అమృతాంశూద్భవాయనమః
భానవేనమః
శశిబిన్దవేనమః
సురేశ్వరాయనమః
ఔషధాయనమః
జగతస్సేతవేనమః ౨౮౦
సత్యధర్మపరాక్రమాయనమః
భూతభవ్యభవన్నాథాయనమః
పవనాయనమః
పావనాయనమః
అనలాయనమః
కామఘ్నేనమః
కామకృతేనమః
కాన్తాయనమః
కామాయనమః
కామప్రదాయనమః 300
ప్రభవేనమః
యుగాదికృతేనమః
యుగావర్తాయనమః
నైకమాయాయనమః

ఓం మహాశనాయనమః
అదృశ్యాయనమః
వ్యక్తరూపాయనమః
సహస్రజితేనమః
అనన్తజితేనమః
ఇష్టాయనమః 310
అవిశిష్టాయనమః
శిష్టేష్టాయనమః
శిఖణ్డినేనమః
నహుషాయనమః
వృషాయనమః
క్రోధఘ్నేయనమః
క్రోధకృతేనమః
కర్త్రేనమః
విశ్వబాహవేనమః 320
మహీధరాయనమః
అచ్యుతాయనమః
ప్రథితాయనమః
ప్రాణాయనమః
ప్రాణదాయనమః
వాసవానుజాయనమః
అపాన్నిధయేనమః
అధిష్ఠానాయనమః
అప్రమత్తాయనమః
ప్రతిష్ఠితాయనమః 330
స్కన్దాయనమః
స్కన్దధరాయనమః
ధుర్యాయనమః
వరదాయనమః
వాయువాహనాయనమః
వాసుదేవాయనమః
బృహద్భానవేనమః
ఆదిదేవాయనమః
పురందరాయనమః

ఓం అశోకాయనమః
తారణాయనమః ౩౪౦
తారాయనమః
శూరాయనమః
శౌరయేనమః
జనేశ్వరాయనమః
అనుకూలాయనమః
శతావర్తాయనమః
పద్మినేనమః
పద్మనిభేక్షణాయనమః
పద్మనాభాయనమః
అరవిందాక్షాయనమః ౩౫౦
పద్మగర్భాయనమః
శరీరభృతేనమః
మహర్ధయేనమః
ఋద్ధాయనమః
వృద్ధాత్మనేనమః
మహాక్షాయనమః
గరుడధ్వజాయనమః
అతులాయనమః
శరభాయనమః
భీమాయనమః ౩౬౦
సమయజ్ఞాయనమః
హవిషే, హరయేనమః
సర్వలక్షణలక్షణ్యాయనమః
లక్ష్మీపతయేనమః
సమితింజయాయనమః
అక్షరాయనమః
రోహితాయనమః
మార్గాయనమః
హేతవేనమః
దామోదరాయనమః ౩౭౦
సహాయనమః
మహీధరాయనమః

ఓం మహాభాగాయనమః
వేగవతేనమః
అమితాశనాయనమః
ఉద్భవాయనమః
క్షోభణాయనమః
దేవాయనమః
శ్రీగర్భాయనమః
పరమేశ్వరాయనమః ౩౮౦
కరణాయనమః
కారణాయనమః
కర్త్రేనమః
వికర్త్రేనమః
గహనాయనమః
గుహాయనమః
వ్యవసాయాయనమః
వ్యవస్థానాయనమః
సంస్థానాయనమః
స్థానదాయనమః ౩౯౦
ధ్రువాయనమః
పరర్ధయేనమః
పరమస్పష్టాయనమః
తుష్టాయనమః
పుష్టాయనమః
శుభేక్షణాయనమః
రామాయనమః
విరామాయనమః
విరతాయనమః
మార్గాయనమః ౪౦౦
విరజోమార్గాయనమః
నేయాయనమః
నయాయనమః
అనయాయనమః
వీరాయనమః
శక్తిమతాంశ్రేష్ఠాయనమః

ఓం ధర్మాయనమః
ధర్మవిదుత్తమాయనమః
వైకుంఠాయనమః
పురుషాయనమః ౮౧౦
ప్రాణాయనమః
ప్రాణదాయనమః
ప్రణవాయనమః
పృథవేనమః
హిరణ్యగర్భాయనమః
శత్రుఘ్నాయనమః
వ్యాప్తాయనమః
వాయవేనమః
అధోక్షజాయనమః
ఋతవేనమః ౮౨౦
సుదర్శనాయనమః
కాలాయనమః
పరమేష్ఠినేనమః
పరిగ్రహాయనమః
ఉగ్రాయనమః
సంవత్సరాయనమః
దక్షాయనమః
విశ్రామాయనమః
విశ్వదక్షిణాయనమః
విస్తారాయనమః ౮౩౦
స్థావరాయనమః
స్థాణవేనమః
ప్రమాణాయనమః
బీజాయావ్యయాయనమః
అర్థాయనమః
అనర్థాయనమః
మహాకోశాయనమః
మహాభోగాయనమః
మహాధనాయనమః
అనిర్విణ్ణాయనమః ౮౪౦

ఓం స్థవిష్ఠాయనమః
భువేనమః
ధర్మరూపాయనమః
మహామఖాయనమః
నక్షత్రనేమయేనమః
నక్షత్రిణేనమః
క్షమాయనమః
క్షామాయనమః
సమీహనాయనమః
యజ్ఞాయనమః ౮౫౦
ఇజ్యాయనమః
మహేజ్యాయనమః
క్రతవేనమః
సత్రాయనమః
సతాంగతయేనమః
సర్వదర్శినేనమః
విముక్తాత్మనేనమః
సర్వజ్ఞాయనమః
జ్ఞానాయోత్తమాయనమః
సువ్రతాయనమః ౮౬౦
సుముఖాయనమః
సూక్ష్మాయనమః
సుఘోషాయనమః
సుఖదాయనమః
సుహృదేనమః
మనోహరాయనమః
జితక్రోధాయనమః
వీరబాహవేనమః
విదారణాయనమః
స్వాపనాయనమః ౮౭౦
స్వవశాయనమః
వ్యాపినేనమః
నైకాత్మనేనమః
నైకకర్మకృతయేనమః

ఓం వత్సరాయనమః
వత్సలాయనమః
వత్సినేనమః
రత్నగర్భాయనమః
ధనేశ్వరాయనమః
ధర్మకృతేనమః ౪౮౦
ఓం ధర్మగోప్త్రేనమః
ధర్మిణేనమః
సతేనమః
అక్షరాయనమః
అసతేనమః
క్షరాయనమః
అవిజ్ఞాత్రేనమః
సహస్రాంశవేనమః
విధాత్రేనమః
కృతలక్షణాయనమః ౪౯౦
ఓం గభస్తినేమయేనమః
సత్త్వస్థాయనమః
సింహాయనమః
భూతమహేశ్వరాయనమః
ఆదిదేవాయనమః
మహాదేవాయనమః
దేవేశాయనమః
దేవభృతేనమః
గురవేనమః
ఉత్తరాయనమః ౫౦౦
ఓం గోపతయేనమః
గోప్త్రేనమః
జ్ఞానగమ్యాయనమః
పురాతనాయనమః
శరీరభూతభృతేనమః
భోక్త్రేనమః
కపీంద్రాయనమః
భూరిదక్షిణాయనమః
సోమపాయనమః
అమృతపాయనమః ౫౧౦
ఓం సోమాయనమః
పురుజితేనమః
పురుసత్తమాయనమః
వినయాయనమః
జయాయనమః
సత్యసంధాయనమః
దాశార్హాయనమః
సాత్వతాంపతయేనమః
జీవాయనమః
వినయిత్రేనమః ౫౨౦
ఓం సాక్షిణేనమః
ముకుందాయనమః
అమితవిక్రమాయనమః
అంభోనిధయేనమః
అనంతాత్మనేనమః
మహోదధిశయాయనమః
అంతకాయనమః
అజాయనమః
మహార్హాయనమః
స్వాభావ్యాయనమః ౫౩౦

ఓం జితామిత్రాయనమః
ప్రమోదనాయనమః
ఆనందాయనమః
నందనాయనమః
నందాయనమః
సత్యధర్మిణేనమః
త్రివిక్రమాయనమః
మహర్షయేనమః
కపిలాచార్యాయనమః
కృతజ్ఞాయనమః ౫౩౦
ఓం మేదినీపతయేనమః
త్రిపదాయనమః
త్రిదశాధ్యక్షాయనమః
మహాశృంగాయనమః
కృతాంతకృతేనమః
మహావరాహాయనమః
గోవిందాయనమః
సుషేణాయనమః
కనకాంగదినేనమః
గుహ్యాయనమః ౫౪౦
ఓం గంభీరాయనమః
గహనాయనమః
గుప్తాయనమః
చక్రగదాధరాయనమః
వేధసేనమః
స్వాంగాయనమః
ధర్మ్యజితాయనమః
మహామఖాయనమః
అజితాయనమః
కృష్ణాయనమః ౫౫౦
ఓం దృఢాయనమః
సంకర్షణాయనమః
అచ్యుతాయనమః
వరుణాయనమః
వారుణాయనమః
వృక్షాయనమః
పుష్కరాక్షాయనమః
మహామనసేనమః
భగవతేనమః
భగఘ్నేనమః ౫౬౦
ఓం ఆనందినేనమః
వనమాలినేనమః
హలాయుధాయనమః
ఆదిత్యాయనమః
జ్యోతిరాదిత్యాయనమః
సహిష్ణవేనమః
గతిసత్తమాయనమః
సుధన్వనేనమః
ఖండపరశవేనమః
దారుణాయనమః ౫౭౦
ఓం ద్రవిణప్రదాయనమః
దివిస్పృశేనమః
సర్వదృశేనమః
వ్యాసాయనమః
వాచస్పతయేనమః
అయోనిజాయనమః

త్రిసామ్నే నమః
సామగాయ నమః
సామ్నే నమః
నిర్వాణాయ నమః ౫౯౦
ఓం భేషజాయ నమః
భిషజే నమః
సన్న్యాసకృతే నమః
శమాయ నమః
శాంతాయ నమః
నిష్ఠాయ నమః
శాంతయే నమః
పరాయణాయ నమః
శుభాంగాయ నమః
శాంతిదాయ నమః ౬౦౦
ఓం స్రష్ట్రే నమః
కుముదాయ నమః
కువలేశాయ నమః
గోహితాయ నమః
గోపతయే నమః
గోప్త్రే నమః
వృషభాక్షాయ నమః
వృషప్రియాయ నమః
అనివర్తినే నమః
నివృత్తాత్మనే నమః ౬౧౦
ఓం సంక్షేప్త్రే నమః
క్షేమకృతే నమః
శివాయ నమః
శ్రీవత్సవక్షసే నమః
శ్రీవాసాయ నమః
శ్రీపతయే నమః
శ్రీమతాంవరాయ నమః
శ్రీదాయ నమః
శ్రీశాయ నమః
శ్రీనివాసాయ నమః ౬౨౦
ఓం శ్రీనిధయే నమః
శ్రీభావనాయ నమః
శ్రీధరాయ నమః
శ్రీకరాయ నమః
శ్రేయసే, శ్రీమతే నమః
లోకత్రయాశ్రయాయ నమః
స్వక్షాయ నమః
స్వంగాయ నమః
శతానందాయ నమః
నందయే నమః ౬౩౦
ఓం జ్యోతిర్గణేశ్వరాయ నమః
విజితాత్మనే నమః
విధేయాత్మనే నమః
సత్కీర్తయే నమః
ఛిన్నసంశయాయ నమః
ఉదీర్ణాయ నమః
సర్వతశ్చక్షుషే నమః
అనీశాయ నమః
శాశ్వతస్థిరాయ నమః
భూశయాయ నమః ౬౪౦
ఓం భూషణాయ నమః
భూతయే నమః

అశోకాయనమః
శోకనాశనాయనమః
అర్చిష్మతేనమః
అర్చితాయనమః
కుంభాయనమః
విశుద్ధాత్మనేనమః
విశోధనాయనమః
అనిరుద్ధాయనమః ౬౪౦
ఓం అప్రతిరథాయనమః
ప్రద్యుమ్నాయనమః
అమితవిక్రమాయనమః
కాలనేమిఘ్నేనమః
శౌరయేనమః
శూరాయనమః
శూరజనేశ్వరాయనమః
త్రిలోకాయనమః
కేశవాయనమః
త్రిలోకేశాత్మనేనమః ౬౫౦
ఓం కేశిఘ్నేనమః
హరయేనమః
కామదేవాయనమః
కామపాలాయనమః
కామినేనమః
కాంతాయనమః
కృతాగమాయనమః
అనిర్దేశ్యవపుషేనమః
విష్ణవేనమః
వీరాయనమః ౬౬౦

ఓం అనంతాయనమః
ధనంజయాయనమః
బ్రహ్మణ్యాయనమః
బ్రహ్మకృద్బ్రహ్మణేనమః
బ్రహ్మణేనమః
బ్రహ్మవివర్ధనాయనమః
బ్రహ్మవిదేనమః
బ్రాహ్మణాయనమః
బ్రహ్మిణేనమః
బ్రహ్మజ్ఞాయనమః ౬౭౦
ఓం బ్రాహ్మణప్రియాయనమః
మహాకర్మణేనమః
మహాక్రమాయనమః
మహాతేజసేనమః
మహోరగాయనమః
మహాక్రతవేనమః
మహాయజ్వనేనమః
మహాయజ్ఞాయనమః
మహాహవిషేనమః
స్తవ్యాయనమః ౬౮౦
ఓం స్తవప్రియాయనమః
స్తోత్రాయనమః
స్తుతాయనమః
స్తోత్రేనమః, రణప్రియాయ
పూర్ణాయనమః
పూరయిత్రేనమః
పుణ్యాయనమః
పుణ్యకీర్తయేనమః

ఓం అనామయాయనమః
మనోజవాయనమః ౭౦౦
తీర్థకరాయనమః
వసురేతసేనమః
వసుప్రదాయనమః
వాసుదేవాయనమః
వసవేనమః
వసుమనసేనమః
హవిషేనమః
సద్గతయేనమః
సత్కృతయేనమః
సత్తాయనమః ౭౧౦
సద్భూతయేనమః
సత్పరాయణాయనమః
శూరసేనాయనమః
యదుశ్రేష్ఠాయనమః
సన్నివాసాయనమః
సుయామునాయనమః
భూతావాసాయనమః
వాసుదేవాయనమః
సర్వాసునిలయాయనమః
అనలాయనమః ౭౨౦
దర్పఘ్నేనమః
దర్పదాయనమః
అదృప్తాయనమః
దుర్ధరాయనమః
అపరాజితాయనమః

విశ్వమూర్తయేనమః
మహామూర్తయేనమః
దీప్తమూర్తయేనమః
అమూర్తిమతేనమః
అనేకమూర్తయేనమః ౭౩౦
అవ్యక్తాయనమః
శతమూర్తయేనమః
శతాననాయనమః
ఏకాయ(కస్మై)నమః
నైకాయ(కస్మై)నమః
స్థవాయనమః
స్థానాయనమః
వాయవేనమః
కామాయనమః
కిమే(కస్మై)నమః ౭౪౦
యతే(యస్మై)నమః
తత్వే(తస్మై)నమః
పదాయానుత్తమాయనమః
లోకబంధవేనమః
లోకనాథాయనమః
మాధవాయనమః
భక్తవత్సలాయనమః
సువర్ణవర్ణాయనమః
హేమాంగాయనమః
వరాంగాయనమః ౭౫౦
చందనాంగదినేనమః
వీరఘ్నేనమః
విషమాయనమః
శూన్యాయనమః
ఘృతాశిషేనమః
అచలాయనమః

చలాయనమః
అమానినేనమః
మానదాయనమః
మాన్యాయనమః ౭౬౦
లోకస్వామినేనమః
త్రిలోకధృతేనమః
సుమేధసేనమః
మేధజాయనమః
ధన్యాయనమః
సత్యమేధసేనమః
ధరాధరాయనమః
తేజోవృషాయనమః
ద్యుతిధరాయనమః
సర్వశస్త్రభృతాంవరాయనమః ౭౭౦
ప్రగ్రహాయనమః
నిగ్రహాయనమః
వ్యగ్రాయనమః
నైకశృంగాయనమః
గదాగ్రజాయనమః
చతుర్మూర్తయేనమః
చతుర్బాహవేనమః
చతుర్వ్యూహాయనమః
చతుర్గతయేనమః
చతురాత్మనేనమః ౭౮౦
చతుర్భావాయనమః
చతుర్వేదవిదేనమః
ఏకపదేనమః
సమావర్తాయనమః
నివృత్తాత్మనేనమః
దుర్జయాయనమః
దురతిక్రమాయనమః
దుర్లభాయనమః
దుర్గమాయనమః
దుర్గాయనమః ౭౯౦

దురావాసాయనమః
దురారిఘ్నేనమః
శుభాంగాయనమః
లోకసారంగాయనమః
సుతంతవేనమః
తంతువర్ధనాయనమః
ఇంద్రకర్మణేనమః
మహాకర్మణేనమః
కృతకర్మణేనమః
కృతాగమాయనమః ౮౦౦
ఉద్భవాయనమః
సుందరాయనమః
సుందాయనమః
రత్ననాభాయనమః
సులోచనాయనమః
అర్కాయనమః
వాజసనాయనమః
శృంగిణేనమః
జయంతాయనమః
సర్వవిజయినేనమః ౮౧౦
సువర్ణబిందవేనమః
అక్షోభ్యాయనమః
సర్వవాగీశ్వరేశ్వరాయనమః
మహాహ్రదాయనమః
మహాగర్తాయనమః
మహాభూతాయనమః
మహానిధయేనమః
కుముదాయనమః
కుందరాయనమః
కుందాయనమః ౮౨౦
పర్జన్యాయనమః
పవనాయనమః
అనిలాయనమః
అమృతాంశాయనమః

ఓం అమృతవపుషే నమః
సర్వజ్ఞాయ నమః
సర్వతోముఖాయ నమః
సులభాయ నమః
సువ్రతాయ నమః
సిద్ధాయ నమః ౪౩౦
శత్రుజిచ్ఛత్రుతాపనాయ నమః
న్యగ్రోధోదుంబరాయ నమః
అశ్వత్థాయ నమః
చాణూరాంధ్రనిషూదనాయ నమః
సహస్రార్చిషే నమః
సప్తజిహ్వాయ నమః
సప్తైధసే నమః
సప్తవాహనాయ నమః
అమూర్తయే నమః
అనఘాయ నమః ౪౪౦
అచింత్యాయ నమః
భయకృతే నమః
భయనాశనాయ నమః
అణవే నమః
బృహతే నమః
కృశాయ నమః
స్థూలాయ నమః
గుణభృతే నమః
నిర్గుణాయ నమః
మహతే నమః ౪౫౦
అధృతాయ నమః
స్వధృతాయ నమః
స్వాస్థ్యాయ నమః
ప్రాగ్వంశాయ నమః
వంశవర్ధనాయ నమః
భారభృతే నమః
కథితాయ నమః
యోగినే నమః

ఓం యోగీశాయ నమః
సర్వకామదాయ నమః ౪౬౦
ఆశ్రమాయ నమః
శ్రమణాయ నమః
క్షామాయ నమః
సుపర్ణాయ నమః
వాయువాహనాయ నమః
ధనుర్ధరాయ నమః
ధనుర్వేదాయ నమః
దండాయ నమః
దమయిత్రే నమః
అమాయాయ నమః ౪౭౦
అపరాజితాయ నమః
సర్వసహాయ నమః
నియంత్రే నమః
నియమాయ నమః
యమాయ నమః
సత్త్వవతే నమః
సాత్త్వికాయ నమః
సత్యాయ నమః
సత్యధర్మపరాయణాయ నమః
అభిప్రాయాయ నమః ౪౮౦
ప్రియార్హాయ నమః
అర్హాయ నమః
ప్రియకృతే నమః
ప్రీతివర్ధనాయ నమః
విహాయసగతయే నమః
జ్యోతిషే నమః
సురుచయే నమః
హుతభుజే నమః
విభవే నమః
రవయే నమః
విరోచనాయ నమః ౪౯౦
సూర్యాయ నమః
సవిత్రే నమః
రవిలోచనాయ నమః

ఓంసవిత్రేనమః
రవిలోచనాయనమః
అనంతహుతభుగ్భోక్త్రేనమః
సుఖదాయనమః
నైకదాయనమః
అగ్రజాయనమః
అనిర్విణ్ణాయనమః
సదామర్షిణేనమః ౯౦౦
లోకాధిష్ఠానాయనమః
అద్భుతాయనమః
సనాతనాయనమః
తమాయనమః
కపిలాయనమః
కపయేఅవ్యయాయనమః
స్వస్తిదాయనమః
స్వస్తికృతేనమః
స్వస్తినేనమః
స్వస్తిభుజేనమః ౯౧౦
స్వస్తిదక్షిణాయనమః
అరౌద్రాయనమః
కుండలినేనమః
చక్రిణేనమః
విక్రమిణేనమః
ఊర్జితశాసనాయనమః
శబ్దాతిగాయనమః
శబ్దసహాయనమః
శిశిరాయనమః
శర్వరీకరాయనమః ౯౨౦
అక్రూరాయనమః
పేశలాయనమః
దక్షాయనమః
దక్షిణాయనమః
క్షమిణాంవరాయనమః
విద్వత్తమాయనమః
వీతభయాయనమః
పుణ్యశ్రవణకీర్తనాయనమః
ఉత్తారణాయనమః
దుష్కృతిఘ్నేనమః ౯౩౦
పుణ్యాయనమః
దుస్స్వప్ననాశనాయనమః
వీరఘ్నేనమః
రక్షణాయనమః
సంతాయనమః
జీవనాయనమః
పర్యవస్థితాయనమః
అనంతరూపాయనమః
అనంతశ్రియేనమః
జితమన్యవేనమః ౯౪౦
భయాపహాయనమః
చతురశ్రాయనమః
గంభీరాత్మనేనమః
విదిశాయనమః
వ్యాదిశాయనమః
దిశాయనమః
అనాదయేనమః
భువోభువేనమః
లక్ష్మీప్రపతయేనమః
సువీరాయనమః ౯౫౦
రుచిరాంగదాయనమః
జననాయనమః
జనజన్మాదయేనమః
భీమాయనమః
భీమపరాక్రమాయనమః
ఆధారనిలయాయనమః
ధాత్రేనమః
పుష్పహాసాయనమః
ప్రజాగరాయనమ.
ఊర్ధ్వగాయనమః ౯౬౦

ఓం సత్వదాచారాయనమః
ప్రాణదాయనమః
ప్రణవాయనమః
ప్రణాయనమః
ప్రమాణాయనమః
ప్రాణనిలయాయనమః
ప్రాణధృతేనమః
ప్రాణజీవనాయనమః
తత్త్వాయనమః
తత్త్వవిదేనమః ౯౭౦
ఓం ఏకాత్మనేనమః
జన్మమృత్యుజరాతిగాయ
భూర్భువస్స్వస్తరవేనమః
తారాయనమః
సవిత్రేనమః
ప్రపితామహాయనమః
రథాంగపాణయేనమః
యజ్ఞాయనమః
యజ్ఞపతయేనమః
యజ్వనేనమః ౯౮౦
ఓం యజ్ఞాంగాయనమః
యజ్ఞవాహనాయనమః
యజ్ఞభృతేనమః
యజ్ఞకృతేనమః
యజ్ఞినేనమః
యజ్ఞభుజేనమః
యజ్ఞసాధనాయనమః
యజ్ఞాంతకృతేనమః
యజ్ఞగుహ్యాయనమః
అన్నాయనమః ౯౯౦
ఓం అన్నాదాయనమః
ఆత్మయోనయేనమః
స్వయంజాతాయనమః
వైఖానాయనమః
సామగాయనమః
దేవకీనందనాయనమః
స్రష్ట్రేనమః
క్షితీశాయనమః
పాపనాశనాయనమః
శంఖభృతేనమః ౧౦౦౦
ఓం నందకినేనమః
చక్రిణేనమః
శార్ఙ్గధన్వనేనమః
గదాధరాయనమః
అక్షోభ్యాయనమః
సర్వప్రహరణాయుధాయనమః



# విజ్ఞప్తి.

ఈ సత్యనారాయణ వ్రతకల్పము—9 తొంమ్మిదధ్యాయములు గలది (12) కూర్పు— దైవానుగ్రహముచే— నేటికి తీర్చి వారివారికి పంపుచుంటిని— ఆలస్యమునకు కారణము పేపరుధరలు చాల విస్తరించినందున—ప్రతి 1కి రు. 1–0–0.

వలయువారు:—బందరు, బచ్చుపేటకు వ్రాయండి,

ఇట్లు:—చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి

ఆర్యానంద ప్రెస్—25-9-45—(1000) ప్రతులు.

ఈ గ్రంథములు వలయువారు:—

ఆర్యానంద ప్రెస్, బచ్చుపేట, మచిలీపట్టణము అని వ్రాసి తెప్పించుకొనవలయును.